ఓం

శ్రీ రామచంద్ర యోగీ గురు పరబ్రహ్మణేనమః

# పరిపూర్ణ బ్రహ్మవిద్య

**నిత్యశాంతి - జన్మరాహిత్యము కొరకు**


రచన

**పొన్నాల వెంకటేశ్వర రాజయోగి**



ప్రచురణ

**పొన్నాల పబ్లికేషన్స్**

రాజయోగాశ్రమం

నర్సాపురం - 534 275, పశ్చిమగోదావరి జిల్లా

# ముందుమాట

ఓపరబ్రహ్మ స్వరూపులారా!.... అలా పిలిచానేమని అనుకుంటున్నారా? మీరు పరబ్రహ్మ స్వరూపులే. కారణం పరబ్రహ్మస్వరూపములేని చోటులేదు. సృష్టిలో ఎన్ని లోకాలు వున్నా అంతటా లోపలా వెలుపలా ములుగ్రుచ్చు సందులేక పరబ్రహ్మస్వరూపమున్నది. అనగా పిపీలకాది బ్రహ్మ పర్యంతము పరబ్రహ్మస్వరూపమున్నదని పెద్దలు చెప్పుదురు. అనగా ప్రతి జీవిలోను పరబ్రహ్మస్వరూప మున్న దని అర్థము. ఆ స్వరూపమును తెలిసికొనుటయే తన్నుతాను తెలిసికొనుట. ఇది సృష్టికి అతీతమైన విషయము.

సృష్టి ప్రపంచము మాయామోహమును కల్పించి జీవులను సమ్మోహితులను చేస్తున్నది. కనుకనే ప్రతి జీవి జన్మతోనే మాయ ఆవరింపబడి అజ్ఞానమును పొందుచున్నది. దీనినే అహంకారమందురు. దానితో సత్త్వ రజస్తమోగుణములనే త్రిగుణములు కలిగినవి. దానివలన అజ్ఞానము అనే అవిద్యను పొందుచున్నారు. అదే అహంకారము. అందుచేత అహంకారము లేని మానవుడులేడు దానిలో చిక్కుబడి మానవులు కోర్కెలతో నానాయాతనలు పొందుచున్నారు. మనస్సుకు సుఖము లేదు, శరీరానికి తీరిక లేదు, తృప్తి లేదు, ఆనందము లేదు. తమ కళ్ళతో చావుపుట్టుకలను చూస్తూనేవున్నారు. ఇది శాశ్వతము కాదని అర్థము చేసుకోలేకపోతున్నారు. అటువంటి అజ్ఞానముతో ఎంతో కష్టపడి ఆస్తులను సంపాదిస్తున్నారు. అనగా కుయుక్తులతోగాని, మోసముతో గాని యెత్తుకు పైయెత్తులతోగాని ఎంతో ఎంతో ధనము, ఆస్తులు సంపాదిస్తు న్నారు. కొందరు అలా సంపాదించి సంపాదించి కాలము తీరి చివరకు చనిపోతున్నారు. అలా చనిపోయినప్పుడు అలా సంపాదించిన ధనముగాని ఆస్తులుగాని, తమకూడా తీసుకొనివెళ్ళుట లేదు. చివరకు తన శరీరమును కూడా వదలి వెళ్ళిపోతున్నారు. ఈవిషయం తెలియనివారుండరు. ఆకుటుంబములో మిగిలినవారు ఈ యాస్తి మనకోసమేగదా అని అనందిస్తున్నారు. కొందరు అటువంటి ఆస్తులకోసం తగవులాడుకుంటూ కొట్టుకొనిచస్తున్నారు.

కొందరు సామాన్యులు స్వల్పసంపాదనపరులు నిస్పృహగాను, కొందరు తృప్తిగాను ఉంటున్నారు.

ఈ ప్రపంచము స్వప్నము లాంటిది. నిద్రలో కలగన్నపుడు ఆ కలలో సంతోషమును కలిగించేవి, దుఃఖమును కలిగించేవి, భయమును కలిగించేవి, ఆశను కలిగించేవి, దృశ్యములు ఒక్కొక్కరికి ఒక్కొక్క మాదిరిగా కనబడును. మెలకువరాగానే అవి అన్నియు మాయ మగును. మెలకువతో కలలోని

దృశ్యములలో ఒకటి కూడామిగలదు. ఈప్రపంచము కూడా అటువంటిదే. కాని యెవరికిని ఇది అటువంటిదేనని అనిపించదు. అందుచేతనే కక్షలు కార్పణ్యములు హత్యలు దోపిడీలు మోసములు అనేకానేక అనర్థములు జరుగుచున్నది. దీనికి కారణము అహంకారమే. అహంకారము మానవుని పశువుగా మార్చును, దురహంకారము మానవుని రాక్షసుని గా మార్చునని పెద్దలన్నారు. అహంకారముతో మమకార ముండును. ఈ రెండింటివల్లనే కర్మలు కర్మలతోకర్మ ఫలములు, జన్మములు సుఖదుఃఖ ములు మొదలైనవాటితో జననము మరణములు ఒకదాని తర్వాత మరొక టి కలుగుతూనే వున్నవి. ఆవిధముగా జనన మరణ స్థితిని దాటలేకపోతున్నారు.

మానవ జన్మ **84** లక్షల జీవరాసులలో వుత్కృష్టమయినదని పెద్దలు చెప్పుదురు. ఎందుచేతననగా మానవునకు భగవంతుని (తన్నుతాను) తెలుసుకొనుజ్ఞానము కలదు. సద్గురుని చేరి బ్రహ్మవిద్యనభ్యసించిన యెడల తన్నుతాను తెలుసుకొనగలడు. ఇంతటి జ్ఞానము పశుపక్ష్యాదులకు లేదు గనుక అటువంటి జ్ఞానమువుండి పశుపక్ష్యాదులవలె కేవలం ధన సంపాదన సంసారము పోషించుకొనుట, ఇళ్ళువాకిళ్ళు సంపాదించు కొనుటతో తన జీవన స్థితిని సరిపెట్టుకుంటూ వుంటే పశుపక్ష్యాదులకు ఇటువంటి మానవులకు తేడాయేముంది? కనుకనే గురుగీతలో పరమేశ్వరుడు పార్వతికి బ్రహ్మజ్ఞానము నెరుగని మనుజుడు ద్విపాద పశువని **304** శ్లోకమున చెప్పినట్లు సూతమహర్షి శౌనకాది మహామునులకు చెప్పినాడు, అందుచేత మానవుడు బ్రహ్మజ్ఞానము నెరిగి తన వుత్కృష్టతను పెంపొందించుకొని పరబ్రహ్మ స్వరూపు డవ్వవలెను. జనన మరణములను దాటి జన్మ రాహిత్యమును పొంది నిత్యానందుడం కావలెను, ఇటువంటి బ్రహ్మజ్ఞానము గురించి యేమంతమునందునం చెప్పబడలేదు. పరిపూర్ణ బ్రహ్మవిద్య అనే ఈ చిన్ని గ్రంధాన్ని అందజేయు చున్నాను. కాని సద్గురువును చేరిననేగాని యీ బ్రహ్మవిద్య సిద్ధించదు అని గ్రహించగలరు.

ఇట్లు
గ్రంధకర్త



మాతృదేవోభవ - పితృదేవోభవ

జన్మనిచ్చిన వారు

పొన్నాల సూర్యనారాయణ గారు, కనకమ్మ గారు

(1935 సంవత్సరపు ఫోటో)



ఆచార్యదేవోభవ

జన్మను సార్థకము చేసిన సద్గురు దేవుడు

శ్రీ గంగిపాముల శ్రీ రామచంద్ర యోగీంద్రులు.



గ్రంథకర్త

పొన్నాల వెంకటేశ్వర రాజయోగి







మహేశ్వరుడు పార్వతికి చెప్పిన
బ్రహ్మవిద్యను సూత మహర్షి వలన
"గురుగీత"గా స్కాంద పురాణమున
వ్రాయబడినది

త్రేతాయుగమున
శ్రీరామచంద్రుడు వశిష్ఠుని వద్ద
నేర్చిన బ్రహ్మవిద్యను వాల్మీకి మహర్షి
"యోగవాశిష్ఠము" గా వ్రాసినారు

ద్వాపరయుగమున సాందీపుని వద్ద
శ్రీకృష్ణుడు నేర్చిన బ్రహ్మవిద్యను
అర్జునునికి చెప్పినపుడు వ్యాసుడు
"భగవద్గీత"గా వ్రాసినారు



కలియుగమున శ్రీధరస్వామి వలన నేర్చిన బ్రహ్మవిద్యను
శివరామ దీక్షితులవారు "అచల సాంప్రదాయము"గా ప్రచారము చేసిరి

# ఉపోద్ఘాతము

భక్తి అనేక రకములు హిందూమతము ప్రకారము మూడుకోట్ల దేవతలుగలరని నిర్దేశింపబడినది. చివరకు దేవుడొక్కడేయని తెల్చివేయ బడినది. పైన తెలిపిన దేవతల గురించి కొన్ని కథలు గలవు. వాటివలన యే దేవునికి యెటువంటి శక్తి యేయే మహిమలు గలవో చెప్పబడినది మరియు వినాయకుని ఆదిపూజితునిగా తెలుపబడినది. అందుచేతనే యెవరు యేపూజచేసినా యేవ్రతముచేసినా యేయజ్ఞము చేసినా ముందుగా వినాయకుని పూజించి తరవాత చేయవలసిన కార్యక్రమములు జరిపించెదరు. ఇందు కొన్ని పండుగలను కూడా నిర్ణయించినారు. ఉదా: వినాయకచవితి శ్రీరామనవమి, కృష్ణాష్టమి, సంక్రాంతి, భీష్మయేకాదశి, రధసప్తమి, విజయదశమి, నరకచతుర్ధశి, దీపావళిఅమావాస్య, కార్తీకపౌర్ణమి మొదలైనవి. ఇవన్నియు కేవలము శుచిశుభ్రత, ఆరోగ్యము ఆనందము పరస్పర సఖ్యతల నిమిత్తము మాత్రమే(వాటి అంతరార్ధము) ఇవికాక కొన్ని వ్రతములు, ఆవ్రతముల విధానములు, వాటికి సంబంధించిన కథలు వాటిఫలితములు మొదలైన వివరముల పుస్తకములువున్నవి. అనగా సత్యనారాయణవ్రతము, త్రిమూర్తులవ్రతము, లక్ష్మీవ్రతము, అష్టలక్ష్మీవ్రతము, వరలక్ష్మీవ్రతము మొదలైనవి. ఇవన్నీయు కోరికల కొరకే చేస్తారు.

కొందరు యేదో ఒకదేవుని ( నామము) లక్ష్యంగా నిర్ణయించుకొని అనగా రాముడో, కృష్ణుడో, శివుడో, విష్ణువో ఒకరిని నిర్ణయించుకొని వారిపై అపరిమితమైన భక్తిశ్రద్ధలతో పూజించెదరు. కొందరు స్త్రీలు భర్తలను, కొందరు పురుషులు తల్లిదండ్రులను పూజించెదరు. వీరి భక్తి అద్వితీయము ఎందు చేతననగా వీరు నమ్మిన ఏకైక దేవుని భక్తిశ్రద్ధలతో పూజించుటేగాని యేకోరికలు కోరరు. ఉదా: పోతన, త్యాగయ్య, అనసూయ, శ్రవణ్‌కుమార్ వీరికి కష్టములు వచ్చినపుడు. "మనపూర్వజన్మకర్మఫలమే మనము అనుభవిస్తు న్నాము, అవి తప్పవు" అని ఆకష్టాలను ఓర్పుతో ఆనందముగా అను భవిస్తారు. అలాగే సుఖాలు వచ్చినపుడు వారికి కలిగిన ఐశ్వర్యముల గురించి యేమాత్రము గర్వించక యెవరిని నిరసనచేయక అణకువతో సామాన్యులవలె సంచరిస్తారు. వీరు సగుణారాధకులు సద్భక్తులు.

కొందరు కొన్ని శక్తుల కొరకు క్షుద్రదేవతలను ఉపాసిస్తారు. అదివొక ...ప్రైన మత్తు. ఇటువంటివారికి తిరిగి మానవజన్మరాదని గురుగీతలో చెప్పబడినది.

ఉదా: "గురుగీత "

276. శ్లో॥ మోహమారణవశ్యాదితుచ్ఛమంత్రోపదేశినం
నిషిద్ధగురు రిత్యాహుః పండితాస్తత్త్వ దర్శినః

తా॥ మోహనము మారణము వశీకరణము స్థంభనము, ఉచ్చాటనము, విమోచనము వీని యొక్క ప్రయోగములకు సంబంధించిన నీచమంత్రము ...ను ప్రయోగించి యంత్ర, తంత్రములందు నిమగ్నుడై ప్రత్యక్షరాక్ష ...వలెనుండు వాడు నిషిద్ధానాంగురుః అనుటచే నిషిద్ధగురువని కేవలం ...కారకుడని తత్త్వజ్ఞానులగు పండితులు చెప్పుచున్నారు.

282. శ్లో॥ నిషిద్ధగురుశిష్యస్తుదుష్టసంకల్పదూషితః।
బ్రహ్మప్రళయపర్యన్తం న పునర్యాతి మర్త్యతామ్ ॥

తా॥ ఇటువంటి మారణ వశీకరణాది మంత్ర ప్రయోగములుజేసెడి మహాక్రూరుడైన నిషిద్ధగురువు యొక్క శిష్యుడును మహాహింసాకర భావముతో మిగులదూషిత హృదయము గలవాడు గనుకనే యిక ఎన్నిటికీని మనుష్య జన్మము పొందజాలడు, మరియు అఖండదుఃఖములను పొందును. మనుష్యజన్మము వదలి భయంకర పిశాచాదుల జన్మములను ధరించును, వాడు తిరిగి హీనజన్మములనే పొందును. పవిత్ర మానవ జన్మమికరాదు, అని గురుగీత యందు మహేశ్వరుడు పార్వతికి చెప్పినాడు. ఇలా చెప్పిన మహేశ్వరుని వాక్యములు విని పార్వతిదేవి నాథా తమ! వాక్యములను విని నా మనసు చాల భయాందోళనచెందుచున్నది! అని ఈక్రింది విధముగా ప్రశ్నించినది.

"గురుగీత "

285. శ్లో॥ స్వయం మూఢామృత్యు భీతాస్సుకృతాద్విరతిం గతాః
దైవాన్నిషిద్ధగురుగాః యదితేషాన్తుకా గతిః ॥

తా॥ పార్వతిదేవి ప్రశ్నను తెలుపుచున్నారు. స్వయముగా మూఢాత్ములును

పుణ్యమిసుమంతయుచేయనివారును, మరణభయమును పొందువారును దైవవశాత్తుగా నిషిద్ధగురువును పొందినవారైనచో వారిగతియేమి? మనుష్య జన్మ తిరిగిరాదని తెలిపితిరిగదా! ఇంతవరకు పుణ్యముజేసి మనుష్య జన్మమెత్తి నందులకు లాభమేమి? వారు సహవాస దోషముచే మూఢాత్ములైరి వారెన్ని జన్మములకైనను మనుష్యజన్మము ధరించరనియు చెప్పుచున్నారు వారికేదైననుగతి గలదా అని పార్వతి ప్రశ్నించెను. దానికి మహేశ్వరుడు ఈ క్రింది విధముగా చెప్పినాడు.

" **గురుగీత** "

**286.** శ్లో॥ శృణుతత్త్వమిదం దేవి యదా స్యాద్విరతోనరః ।
తదా உ సావధికారీతి ప్రోచ్యతే శృతిమస్తకైః ॥

తా॥ ఓపార్వతిదేవీ। ఎట్టి పాపాత్ములైనను తరింపవచ్చును. భయపడనవసరము లేదు. ఈతరుణోపాయమునే తెలుపుచున్నాను. నిషిద్ధగురువును యెప్పుడు విడుచుచున్నాడో అప్పుడు ఆ నరుడు బ్రహ్మవిద్యాధికారియని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. భవరోగపీడితు లందరికిని శాస్త్రములు గురువులు అవసరం. అటువంటి నిషిద్ధగురువును వదలి ఆ నీచమంత్రములను గంగపాలుజేసి సకలపాపకర్మలనుండి విరమించు వాడెప్పుడగునో అప్పుడు బ్రహ్మవిద్యాధికారి యగును. మరియొక ఆత్మజ్ఞుడగు గురువరుని సేవించి ధన్యాత్ముడు కావచ్చును. ఒకానొకడు మలినబావిలోపడి బురదతోనున్నప్పుడు అట్లేయుండవలయు ననియు వానిగతి అంతేనని యును యేశాస్త్రముజెప్పదు. అయితే యోగ్యత మాత్రముండవలెను. జితేంద్రియుడై శుద్ధాత్ముడై శ్రవణమనన నిధి ధ్యాసములచే క్రమముగా ముక్తుడగుచున్నాడు.

చాలామంది కోరికలకొరకు దేవుని పూజిస్తారుకాని ఇటువంటివారికి ఏదేవునిమీద పరిపూర్ణమయిన భక్తినిలవదు. వీరిభక్తి క్షణాకర్షణ మాత్రమే అనగా ఎవరైనా ఒకదేవుని గూర్చి ఆయన మహిమలను చెప్పినపుడు ఆదేవుని పూజిస్తారు మరియొకడు ఇంకొక దేవుని గూర్చి ఆయన మహిమలను చెప్పినప్పుడు అంతకుముందు పూజించెడి దేవుని వదలి ఆదేవుని పూజిస్తారు. ఇలా ఎంతమంది దేవుళ్ళ గురించి ఎవరు చెప్పినా ఆయాదేవుళ్ళను కోరికల కొరకే పూజిస్తారు. ఇటువంటి స్వభావము గలవారే ఇతరమతముల ప్రచార ప్రబోధములకు లొంగిపోయి ఆయా మతములలోనికి వెళతారు . కారణం

ఇతరమతమువారు వారి మతప్రచారముల కొరకు "మాదేవుడు మంచివాడు మీకోరికలను తీరుస్తాడు, మీరోగములను పోగొడతాడు మీపాపములను కడిగివేస్తాడు," అనిచెప్పి, అలా వారిమతములోనికి చేరనట్లయితే మీరు ఘోరనరకము ననుభవించవలసివస్తుందని చెబుతారు. అటువంటి ప్రచారమునకు ఆకర్షితులైన మూఢులు ఆమతములోనికి పోవుదురు ఇలామత ప్రచారము ఎక్కువగా చేయువారు క్రైస్తవులే. వీరు అనేక విధములుగా ప్రజలను అబద్ధపు మాటల తో ప్రలోభపెట్టి ఆకర్షింపబడేటట్లు చేస్తున్నారు. క్రీస్తు చరిత్ర అయన **13**వ యేట నుండి **31**సం. వయసువరకు బైబిలులో లేదు. కారణం యీ క్రిందనీయబడినది.

బుద్ధుడు క్రీస్తుపూర్వము **500**సం॥లలో బౌద్ధమతమును స్థాపించినాడు తరవాత అశోకుడు బౌద్ధమతమును స్వీకరించి అతి శ్రద్ధా భక్తులతో ఆమతమును దేశదేశములలో ప్రచారము చేయించినాడు. ఆబౌద్ధమతప్రచారమును కాలక్రమమున విన్న యేసుక్రీస్తు తన **13**వ యేట యాత్రికులతో హిందూ దేశమునకు వచ్చి బౌద్ధమతమును సీర్వకరించి, అతి శ్రద్ధతో ఆచరించి ప్రచారము చేసినాడనియు. ఇక్కడ కొన్ని మంత్రములు కొన్నియోగములు, కొంతవైద్యమును నేర్చు కొనినట్లును. మరలా తన **31**వ యేట స్వగ్రామము వెళ్ళినాడని అనేక గ్రంధములు చెప్పియున్నవి. ఈవిషయం గౌరవనీయులు కీర్తిశేషులు, మాజీ రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణగార్కి తెలియుననియు ఒక పత్రికలో వ్రాయబడియున్నది. ఆపత్రిక పేరు రామదర్శనం, పిడుగురాళ్ళ **1977** జనవరి ఫిబ్రవరి సంపుటి **27** సంచికలు **1-2**న ముద్రించినారు."క్రీస్తు భారతదేశ జీవితము" అనుశీర్షిక ఆంగ్లమూలము : శ్రీ ఆర్.ఆర్.సక్సేనా ఎల్.ఎల్.బి., డి.ఎల్.ఎస్సి. అనువాదము: శ్రీ స్వామి కేశవ తీర్థులవారు (సంపాదకుడు) క్రీస్తును శిలువ వేయబడిన తరువాత సమాధినుండి మూడవ రోజున లేచుటకు పైన చెప్పిన విద్యలు సహకరించినవి అనుటలో సందేహము లేదు.

ఈవిషయం క్రైస్తవులకు తెలిసినా ప్రచారమునకు ఆటంకమని దానినిపైకి చెప్పరు. మత ప్రచారము ఇతరమతములవారివద్దకు వెళ్ళి చెప్పకూడదు. హిందూ మతమువారు అటువంటి దుష్ప్రచారము చేయరు. కొందరు యజ్ఞాలు, యాగాలు స్వర్గలోకప్రాప్తి కొరకు చేస్తారు అలా యజ్ఞాలు యాగాలుచేసి స్వర్గలోకము వెళ్లినా ఆపుణ్యఫలము తరిగిపోగానే తిరిగి భూమి మీద జన్మించవలసినదే.

ఉదా: భగవద్గీత 8వ అధ్యాయము.

16. శ్లో॥ ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినో అర్జున
మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ॥

తా॥ ఓఅర్జునా బ్రహ్మలోకము వరకు గల లోకములన్నియు తిరిగి వచ్చెడి స్వభావముగలవి. అనగా వానిని పొందినవారు ఆపుణ్యాఫలము తరిగి పోగానే తిరిగి వచ్చి భూమిమీద జన్మించముచలసినదే. నన్ను పొందినవారికి జన్మ యుండదు.

కాని ఆవిధముగా ఎవరు స్వర్గమునుండి తిరిగి వచ్చి జన్మించినా స్వప్నము కన్నవారికి మెలకువలో ఆస్వప్నవృత్తాంతము గుర్తున్నట్లుగా అస్వర్గసుఖములు గుర్తుండవు.

ఈవిధముగా యజ్ఞాలు , యాగాలు ఎన్నిచేసినా కోరికలకొరకే ఉదా: దశరథుడు పుత్రకామేష్టి యాగముచేసి రామ,లక్ష్మణ, భరత, శతృఘ్న లను పుత్రులుగా పొందినాడు. ధర్మరాజు రాజసూయ యాగముచేసి రాజ్యవిస్తరణ చేసినాడు. జనకుడు యజ్ఞముచేసి యజ్ఞఫలముగా సీతను, ధృపదుడు యజ్ఞముచేసి ద్రౌపతిని పుత్రికగా పొందినాడు.

సత్యనారాయణవ్రతము వరలక్ష్మీ వ్రతము మొదలైనవి ధనము కొరకే చేయుచున్నారు. మరియొక విచిత్రమేమిటంటే పూర్వము దొంగలు తమ దొంగతనములో పట్టుబడకుండా విరివిగా ధనము సంపాదించాలనే కోరికతో అడవులలో కాళికాదేవి ఆలయములను నిర్మించుకొని ఆదేవతకు ఆకోరికతో నరబలి ఇచ్చెడివారు ప్రస్తుతకాలములోకూడా అక్రమ సంపాదన దొరికినట్లు యినహుండీలలో లక్షలు వేస్తామనే కోరికతోనే దేవాలయపు హుండీలలో అజ్ఞాత వ్యక్తులు పెద్దపెద్ద మొత్తములు వేయుచున్నారు అనుటలో సందేహములేదు. ఇట్లే పుణ్యము సంపాదించుటకు పాపములను పోగొట్టు కొనుటకు పర్వ దినములలో నదులలోను సముద్రములోను స్నానములు చేస్తారు. కొందరు కాశీకి పోయి గంగలో స్నానములు చేస్తారు. దానాలు . దర్మాలు చేస్తారు.

# భక్తరామదాసు చరిత్ర
# మూఢనమ్మకాలకు ఒక ఉదాహరణ

రామదాసు అనే మహాభక్తుని మొదటి పేరు కంచర్ల గోపన్న. అతని మేనమామలు అక్కన్న మాదన్నలు. వీరు గోల్కొండ ప్రభువు తానీషా ఆస్థానములో మంత్రులుగా పనిచేయుచున్నారు. వీరు గోపన్నకు భద్రాచలము నందు తహస్సిల్దారు వుద్యోగమునిప్పించినారు. గోపన్న సహజముగా రామభక్తుడు అందుచేత ఇతనిని రామదాసు అని పిలుస్తారు.

రామదాసు తహస్సిల్దారుగా ఉద్యోగములో ప్రవేసించినప్పటి నుండి ప్రజలనుండి వసూలు చేసిన సొమ్మును తానీషాకు పంపవలసియుండగా అలాచేయక తన వద్దనే ఆసొమ్ము ఉంచి, అసొమ్ముతో భద్రాచలములో రామాలయమును నిర్మించాలని అతనికి అభిప్రాయము కలిగినది. ఆ అభిప్రాయము కలిగిన వెంటనే ఆనందముతో రామాలయమును అతి త్వరలో నిర్మించినాడు. ఆలా చేయుట మంచిదాకాదా అని ఆలోచించ లేదు.

ఈవిషయము తానీషాకు తెలిసినది. వెంటనే రామదాసును ఉద్యోగము నుండి తొలగించి చెరసాలలో పెట్టించినారు. అప్పటికీ ఈ ధనము తానీషాకు పంపలేక పోయాననే తలంపురాలేదు.

రామదాసు ఉద్యోగ ధర్మం ప్రజల నుండి వసూలు చేసిన ధనమును తానీషాకు పంపవడం ప్రతి నెలా జీతము తీసుకొనడం. కాని యీమూఢ భక్తితోయీసొమ్మును దేవాలయమునకు ఖర్చుపెట్టడమేమిటి అనే తలంపేరాలేదు. కాని రాముని దేవాలయము ఇంత అందముగా కట్టించినాను. ఆ విగ్రహాలకు అలంకరణల నిమిత్తం ఆభరణాలను చేయించి పెట్టినాను. రాముడు సీతాలక్ష్మణులు చాలాఆనందిస్తారు అనే తృప్తివుంది. కారాగారము లో బాధలు పడలేక నేను నీకు దేవాలయము కట్టించానుగదా నన్ను ఇలాబందిఖానాలో ఉంచావేమయ్యా అని రామదాసు మొదటి కీర్తన అతని బాధ, భక్తితో పాటు కవిత్వము సంగీతము అవలీలగా రావడం వల్ల

"ఎందుకయ్యా ఉంచినావు బందిఖానలో" అని పాడినాడు. ఇంకా విముక్తి జరగలేదు. కొంచెం కోపం వచ్చింది. "సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకము ఆ పతకమునకు పట్టె పదివేలవరహాలు రామచంద్రా" అనే కీర్తన పాడినాడు. అప్పటికీ కారాగార విముక్తికలగలేదు. రాముని మీద ఇంకా కోపం వచ్చింది "ఎవడబ్బసొమ్మని" ఒక కీర్తన పాడినాడు కాని అంతలోనే కోపం తగ్గి పశ్చాత్తాపము తో "అబ్బాతిట్టితినని ఆయాసపడబోకు రామచంద్రా" అని మరియొక కీర్తన పాడినాడు. ఆ బందిఖానాలో వుండలేక మతిస్థిమితము లేక తిప్పలు పడుతున్నాడు ఎంతకీ బంధవిముక్తి కాక పోవడంవలన సీతమ్మను పిలిచి "నను బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లి నను బ్రోవమని చెప్పవే" అనే కీర్తనతో సీతమ్మను వేడుకున్నాడు ఇలా బాధతో భక్తితో ఎన్నో కీర్తనలు పాడినాడు రామదాసు. ఇవన్నీ రామదాసు కీర్తనలని చెప్పబడినాయి. వీటిని భక్తులు చిడతలు వాయించుకుంటూ చిందులు తొక్కుతూ భక్త్యావేశవయుతో పాడుకుంటారు వీనిలో తత్త్వ జ్ఞానవములేదు. దీనిని గమనించుడు రామదాసునకు ఇంటనున్న సుఖము కారాగారమునందు గల కష్టమును గ్రహించగలిగినాడు. ఇందువలన రామదాసునకు బ్రహ్మజ్ఞానములేదని తేటతెల్లమగును. రాముడు వశిష్టుని వలన బ్రహ్మజ్ఞానము కలిగినందువలన పట్టాభిషేకవమునకునూ 14 సంవత్సరాల అరణ్యావాసవమునందు గల కష్టసుఖముల యొక్క వ్యత్యాసము తెలియలేదు.

రామదాసు తన ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తించుకుంటూ ఎప్పటి ధనాన్ని అప్పుడు తానీషాకు పంపినట్లయితే భద్రాచలములో రామాలయము ఉండెడిదికాదు రామదాసు చెరసాలలో ఉండవలసిన స్థితి ఉండెడిదికాదు. దీనికి కారణమేమిటి రామదాసు మూఢభక్తి మూఢనమ్మకం అని చెప్పక తప్పదు. ఇక్కడ గమనించవలసిన విషయం యేమనగా తానీషా కు పంపవలసిన సొమ్ము పంపకుండా దేవాలయం కట్టినందుకు కారాగారములో పెట్టింది తానీషా. విడిపించమని రాముణ్ణి వేడుకున్నాడు రామదాసు.

భగవద్గీతలో **5** వ అధ్యాయము **14** వ శ్లోకము ననుసరించి భగవంతుడు జీవులకుకష్టసుఖములను జనన మరణములను కర్తృత్వమును కర్మఫలము లను ఇచ్చుట లేదు అహంకారముతో పూర్వ జన్మమున యెవరు చేసిన కర్మము వలన ఆకర్మ ఫలములను అనుభవిస్తున్నారని కృష్ణుడు చెప్పి యున్నాడు

అందుచేత మూఢనమ్మకములను వదలి సద్గురుని చేరి బ్రహ్మ విద్యను నేర్చిన వాడు నిత్యానందుడు.

వేదములో చెప్పబడిన మూడు విధానములు గురించి

**భగవద్గీత 2వ అధ్యాయం సాంఖ్యయోగమున ఉదా:**

**42.** శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్య విపశ్చిత ః
వేదవాదరతాః పార్థనాన్య దస్తీతి వాదినః

**43.** శ్లో॥ కామాత్మానః స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదామ్
క్రియా విశేష బహులాం భోగైశ్వర్యగతిం ప్రతి।

**44.** శ్లో॥ భోగైశ్వర్య ప్రసక్తానాం తయా ఉ పహృత చేత సామ్
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే॥

తా॥ అనగా శ్రీకృష్ణుడు అర్జునునకు ఈవిధముగా చెప్పియున్నాడు స్వర్గానికంటే అధికమయిన ఫలము వేరొకటి లేదని వాదించువారు కోరికలతో నిండిన మనస్సుగల వారును స్వర్గముయందు ఆసక్తి గలవారు అవివేకులు అనగా తత్త్వము తెలియని అల్పజ్ఞానులు. జన్మము కర్మముల ఫలితమును యిచ్చునది భోగములను ఐశ్వర్యములను సంపాదించుటకు వేరువేరు కర్మలతో కూడినదియు. ఫలవంతముకాని మార్గములను చెప్పే విషయాల మీద ఆశక్తికలవారికి బ్రహ్మవిద్యయందాసక్తి కలగదు.

వేదములు మూడు విభాగములు కలవు. 1. కర్మకాండ, 2. ఉపాసనాకాండ, 3. జ్ఞానకాండ అనునవి. పైదెలిపిన మూడు శ్లోకముల యందు తెలుపబడినవి. అవివేకులు మొదటి కర్మకాండనే పట్టుకొని అందు స్వర్గాది ఫలములను చెప్పుభాగమునే తీసుకొని తక్కిన రెండింటిని వదలి వేయుదురు. మొదటి దానిలో ఈప్రకారముగా చేసినచో స్వర్గభోగములు కలుగునని చెప్పు విషయమునే తీసుకొని ఇంతకంటె వేరేయేమీ లేదని వాదింతురు. వేదాంతములో మోక్షప్రాప్తికై చెప్పబడినవెన్ని యోగలవు. వాటి నన్నింటిని వదలి వేయుదురు. స్వర్గమున కెళ్ళిన వారు కూడా ఆఫలముపూర్తి అవగానే తిరిగి భూమిమీద జన్మించవలసినదే. ( ఉ॥ భగవద్గీత 8-16 చెప్పబడినది).

# తీర్థయాత్రలు -స్వప్నము - స్వర్గలోకము

**తీర్థయాత్రలు :** ఒక వ్యక్తిగాని ఒక కుటుంబముగాని కొన్ని కుటుంబములు గాని తీర్థయాత్రలకు వెళ్ళాలి అనే తలంపువచ్చినపుడు దానికెంత ఖర్చుఅవుతుందని ఆలోచనచేస్తారు. అనగా ఇక్కడనుండి బయలుదేరి ఆ తీర్థయాత్రలను సేవించి తిరిగి ఇంటికి చేరడానికి ఎంత ఖర్చు అవుతుంది, ఇంకా అవిఇవి ఇష్టమయినవి కొనుక్కొనడానికి చేతిలో ఎంత ఉంచుకోవాలి అని అంచనావేసుకుని అంతసొమ్ము ప్రతివారు పట్టుకుని యాత్రాస్పెషల్ బస్సులలోనో రైలులోనో బయలు దేరతారు. యాత్రలన్నీ తిరిగి అనుకున్నట్లు అయా ఇష్టదేవతల ఆలయములను దర్శించుకొని మార్గములో ఉన్నకొన్ని పుణ్యానదులలో స్నానములను చేసి మన పాపములు పోయినవని తృప్తిపడి యాత్రలలో వారివారి యిష్టముల ప్రకారము కొన్ని వస్తువులను కొనుక్కొని ఇళ్ళకు తిరిగి వస్తారు.

తిరిగి తిరిగి వచ్చిన వారు కొంతమంది కొందరికి బోజనములు యేర్పాటు చేసుకొని వచ్చినవారికి యాత్రావిశేషాలను చూచిన వింతలను చెప్పుదురు. అలా చెప్పడంలో కొంత గర్వము, తృప్తి ఆనందము వారికి ఉంటుంది. ఇవి తీర్థయాత్రల విషయం.

**స్వప్నము :** సాధారణముగా మనుష్యులందరికీ స్వప్నములు వస్తాయి. మెలకువరాగానే ఆస్వప్నవృత్తాంతము కొన్ని గుర్తుండును. కొన్ని గుర్తుండవు. గుర్తున్న స్వప్నవృత్తాంతము మెలకువరాగానే ఇంట్లోవున్న వారికిగాని మరెవరికైనాగాని చెప్పగలుగుతారు. దీనిని బట్టి కొంతమందికి కొన్ని కలలు సంతోషము కలిగంచెడివిగాను, కొన్నికలలు భయమును కలిగంచెడివిగాను, కొన్ని బాధకలిగించెడివిగాను వస్తాయి. కొన్నికలలు ఆశాజనకముగా వుంటాయి. మేలు కొనగానే కలలో కనిపించినవి మెలకువలో కనబడవు. ఉదా: కొందరు బంగారము దొరికినట్లు,సంచులలో తీసుకొని వస్తున్నట్లు కలగంటూ ఉండగా మెలకువరాగానే అవి కనబడవు. అపుడు బాధతో ఇదికలకాకపోతే

ఎంతబాగుండును అని కొంతకాలము దానిని తలచుకొని బాధపడతారు కొందరు ఇది కలయే కదా అని అనుభవజ్ఞులవలే సరిపెట్టుకుంటారు. ఈవిధముగా కలగన్నవారు మెలుకువ వచ్చిన తరువాత ఆకల యొక్క వృత్తాంతము. గుర్తుంచుకొని మరియొకరికి చెప్పగలుగుతారు. ఇది స్వప్నవృత్తాంతము .

**స్వర్గలోకము :** స్వర్గావరోహణాభిలాషులు కొందరుంటారు. యజ్ఞయాగములు, దానములు, వ్రతములు, తీర్థయాత్రలు పుణ్యానదులలో పర్వదినముల సందర్భముల యందు స్నానములు చేయుట సంతానములేని వారు పరుల కన్యకు వారి చేతులతో కన్యాదానము చేయుట, పరుల పుత్రులకు వారి చేతులతో ఉపనయనములను చేయట అన్నదానము, గోదానము, సువర్ణదానము మొదలైనవి చేస్తే వారు స్వర్గానికి వెళతారని పురాణపండితులు చెబుతారు.

అందుచేత స్వర్గలోకము పోవలెనని కొందరు మూఢాభిలాషులు పైవిధముగా వారి స్థితిగతులను బట్టి ఏవోకొన్ని చేస్తారు. తృప్తిపడతారు. స్వర్గము లభిస్తుందని ఆశపడుతూవుంటారు.

మరియు కార్తీక పౌర్ణమినాడు కార్తీక అమావాస్య మొత్తము కార్తీక మాసములో దీపారాధన చేయుటవలన కూడా స్వర్గమునకు వెళతారని ఆ పండితులు చెబుతూ ఉంటారు. అసందర్భములోనే పోలి అనే స్త్రీ నదికి వెళ్ళకుండా నూతివద్దనే దీపారాధన కార్తీక అమావాస్యనాడు చేసినదని అందుచేత ఆపోలి స్వర్గానికెళ్ళినదని కథ చెబుతారు.

పైవిధములుగా ఆచరించినవారు కృతయుగమునందును, త్రేతాయుగమునందును, ద్వాపరయుగమునందును ఉందురు. కనీసం ద్వాపరయుగము వరకు పవిత్రంగా కూడా ఆచరించి ఉంటారు. ఆవిధముగా ఆచరించగా స్వర్గానికి తీసుకు వెళ్ళిన పుణ్యము తరిగిపోగానే తిరిగి మానవ లోకానికి వచ్చి జన్మించవలసినదేనని భగవద్గీతలో 8వ అధ్యాయము అక్షర పరబ్రహ్మ యోగము నందు 16వ శ్లోకములో చెప్పినట్లు ఈ వ్యాసములోనే వ్రాయబడివున్నది.

దానిని బట్టి అన్నిలోకాలు పునరావృత్తి గలవియే అయివున్నవి.

అనగా వానిని పుణ్యఫలితముతో పొందినవారు ఆఫలితము తరిగి పోగానే మరల భూలోకమునకు వచ్చి జన్మనెత్తవలసియేయుండును. కాని బ్రహ్మ విద్యను సద్గురుని ద్వారా పొందిన పరమాత్మస్వరూపులు మరలయెన్నటికిని జన్మబడయరు.

పైవిషయములను బట్టి ఇక్కడ పుణ్యము సంపాదించి స్వర్గమునకు పోయినవారు ఎట్టి పరిస్థితులలోను ఆపుణ్యము తరిగి పోగానే తిరిగి భూలోకమునకు రావలసినదే కదా!

తీర్థయాత్రలు తిరిగి వచ్చినవారు ఆయాత్రల విశేషాలను ఇక్కడున్న వారికి చెప్పినట్లుగాను, కలగన్నవారు మేల్కొన్న తరువాత ఆవచ్చిన కలను వచ్చినట్లుగా చెప్పగలిగినట్లున్నూ స్వర్గలోకానికి వెళ్ళి తిరిగి వచ్చిన వారు ఆ స్వర్గలోక విశేషాలను చెప్పవలసియున్నది గదా! కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగములో ఎక్కువగా యజ్ఞయాగాలు జరిగినట్లు చెప్పబడియున్నది గదా! అప్పటినుంచి ఇప్పటివరకు ఆవిధముగా స్వర్గానికెళ్ళి తిరిగి వచ్చి భూమిమీద జన్మించిన వారు అక్కడ విశేషాలను చెప్పినట్లు యే గ్రంధములోను చెప్పబడియుండలేదు. మనపెద్దలలో కూడా ఎవరూ చెప్పలేదు.

ఎవరు యెన్నిలోకాలకు వెళ్ళినా తిరిగి వచ్చి భూలోకమందు జన్మించినవారు అక్కడ విశేషాలను చెప్పకపోవడానికి కారణమేమిటి? అదియునుగాక రాముడు కృష్ణుడు శ్రీమహావిష్ణువు యొక్క అవతారములు గదా! వారైనా అక్కడ విశేషాలను ఇక్కడ జన్మించిన తర్వాత చెప్పినారా? అలాచెప్పకపోవడానికి కారణమేమిటి అనగా ,

**ఉదా: భగవద్గీత 7వ అధ్యాయము విజ్ఞానయోగము.**

**27.** శ్లో॥ ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వంద్వమోహేన భారత
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప.

**తా॥** సమస్తప్రాణులు పుట్టుకతోనే రాగద్వేషముల వలన కలిగిన సుఖదుఃఖములు మొదలైనవాటి వ్యామోహము వలన మిక్కిలి అజ్ఞానము పొందుచున్నారు. ఆయజ్ఞానము ప్రపంచమున గల మాయావరణ వలన కలుగుచున్నది. అదే అవిద్య. దానివలన పూర్వజన్మపుణ్యాత్ములు ఉద్భవించినా అవతార

పురుషులుద్భవించినా పూర్వ జ్ఞానము జ్ఞప్తికి వుండదు. అందుచేతనే త్రేతాయుగమున రాముడు పదునారవయేటను అవిద్యచే తీర్థయాత్రల పర్యటన అనంతరము విచారములో మునిగియున్న తరుణములో విశ్వామిత్రుడు యాగసంరక్షణార్థము శ్రీరాముని తీసుకొని వెళ్ళుటకు వచ్చినప్పుడు శ్రీరాముని విచారమునకు కారణము గ్రహించి శ్రీరామునికి బ్రహ్మవిద్య చెప్పవలసినదిగా కులగురువైన వశిష్టుని కోరగా వశిష్టుడు రామునికి బ్రహ్మవిద్యను 20 రోజులు చెప్పినాడు ఆ 20 రోజులు నారదుడు తుంబురుడు వాల్మికి, సిద్ధులు మొదలైన వారు వుండి ఆబోధను విన్నారు. దానిని వాల్మికి మహర్షి "యోగవాసిష్టము" అనుగ్రంధముగా వ్రాసినాడు.

మరియు శ్రీకృష్ణుడు అష్టభార్యలను పొంది 16 వేల గోపికా స్త్రీలతో కాలము గడుపుచు అనేక గారడీ విద్యలు చూపినాడు. అనగా పూతన చనిపోవుట యక్షశాప విమోచనము కాళింది మర్దన, గోవర్ధనగిరి నెత్తుట మొదలైనవి చూచినవారు శ్రీకృష్ణుని కృష్ణపరమాత్మయని, కృష్ణభగవానుడని అనిరి. అందువలన నేను మానవుడను నన్ను భగవానుడని పరమాత్మయని ఎందుకంటున్నారని, ఆలోచించి, సాందీప మహర్షి వద్దకు వెళ్ళి బ్రహ్మవిద్యను నేర్చి సందేహనివృత్తి చేసుకున్నాడు. అంతటి రాముడు, కృష్ణుడు సద్గురువును చేరి బ్రహ్మవిద్యను అభ్యసించినప్పుడు ఇక సామాన్యులు మహాపండితులైనను పూర్వజన్మ సుకృతముగల వారైనను సద్గురువును చేరి బ్రహ్మవిద్య నేర్వవలసినదేకదా!

గ్రహించవలసిన దేమనగా నిత్యశాంతిలేని, అనిర్వచనీయ సుఖములేని స్వర్గమెందుకు? అదియునుగాక వరములు పొందిన రాక్షసులెందరో స్వర్గము పోయి దేవేంద్రునోడించి దేవతలనందరిని ఎన్నిసారులో తరిమి తరిమి కొట్టిరి. ఆసందర్భములో ఆరాక్షసులను ఎదురించు శక్తి లేక ఆదేవతలందరు మహావిష్ణువు వద్దకు వెళ్ళి రక్షించమని వేడుకొనిరి. ఆయన అవతారములు యెత్తి భూలోక మందు జన్మించి యెదిగి పెద్దవాడై ఆయారాక్షసులను సంహరించినట్లుగా రామాయణ భారతాది గ్రంధముల వలన విని యుంటిరి. అంతవరకు ఆదేవతలు భయభీతులతోను అశాంతితోను ఎక్కడో

తలదాచుకొనివుంటారుగదా! అందుచేత ఆస్వర్గము లో ఇంద్రాది దేవతలకునూ, పైవిధముగా యజ్ఞాయాగాదులుజేసి తాత్కాలికముగా స్వర్గానికి వెళ్ళిన పుణ్యాత్ములకు సుఖమేది? పుణ్యఫలితమేది? మరి యెవరైనా ప్రశాంతముగా తపస్సుచేసు కుంటుంటే దేవేంద్రుడు వెళ్ళి ఆతపస్సును పాడుచేయడంగాని రంభనో, వూర్వశినో, మేనకనో పంపి మాయా మోహితులను జేసి తపస్సును పాడు చేయడం అనే ప్రయత్నాలు జరుగుతూ ఉన్నట్లు కూడా అనేక ఉదాహరణలున్నట్లు అందరికి తెలిసిన విషయమే గదా!

## కీర్తన : ఆదితాళము

యజ్ఞయాగాదులెందుకురా - స్వర్గభోగాదులెందుకురా అవి
స్వప్నసుఖములని తెలియుమురా - నిత్య శాంతి అటునిలువదురా

1. స్వప్నములోగల కష్టసుఖములు-మెలకువలోనవి గుర్తుండునురా
స్వర్గమొదలియిట జననమందిన-స్వర్గ సుఖములిల గుర్తుండవురా ॥య॥
2. వరములు పొందిన రాక్షసులెందరో-తరిమికొట్టిరే దేవతలందరి
మొరలిడుకొనిరే హరిని వేడుకొని -హరియిల జననము నొంది బ్రోచెనట ॥య॥
3. రామకృష్ణులు అవతరించిరి - త్రేతాయుగమున రామ చంద్రుడు
ద్వాపరయుగమున శ్రీకృష్ణుడును-జననమందిరే సామాన్యముగా ॥య॥
4. రాముడు వశిష్ట మహర్షి వల్లను - వశిష్టగీతను ఆలకించెను.
దానిని వ్రాసెను వాల్మికి మహర్షి యోగవాసిష్ట గ్రంధముగా ॥య॥
5. కృష్ణుడు సాందీపుని కడకేగి - బ్రహ్మవిద్యను అభ్యసించెను.
కృష్ణుడు దానిని అర్జునుకిచ్చెను-వ్యాసుడు భగవద్గీతగ వ్రాసెను ॥య॥
6. పుణ్యమెంత యీలోకమున జేసి- పరలోకానికి తరలివెళ్ళినా
పుణ్యము తరిగి పోయిన వెనుక - ఈలోకానికె తిరిగిరావలె ॥య॥
7. వెంకటేశ్వర రాజయోగి చెప్పిన సత్యము నమ్మి చెడరురా
వేదాంత సారమింతేరా నీ వేరు మార్గములు చూడకురా ॥య॥

# అహంకారము -దురహంకారము

ఏలోకములోనైనా అహంకారములు దురహంకారములు కక్షలు, ద్వేషములు, జనన, మరణములు వున్నవి. అహంకారమును నిర్మూలించుకొను విధానములు ఆలోకములలో లేవు. ఉదా:- దక్షప్రజాపతికి సతీదేవి జననమందినది. సతీదేవిని శివునకిచ్చి వివాహము చేసినాడు. బ్రహ్మ ఒకనాడు యజ్ఞము చేయగా దేవతలందరూ నారదాదిమునీశ్వరులూ మహేశ్వరుడు మహావిష్ణువు మొదలైనవారందరూ హాజరైరి. కొంతసేపటికి దక్షప్రజాపతి ఆసభకు ఆలస్యముగా రాగా అందరూ లేచి నిలబడినారు. మహేశ్వరుడు లేవలేదు. అది గమనించిన దక్షుడు అమితమైన అహంకారముతో అల్లుడనికూడా చూడక మహేశ్వరునికి హవిర్భాగము లందకూడదనియు మరియు అనేక విధములుగా శపించినాడు. ఆవిధముగా అల్లుని శపించడం అతనికి తగునా? అందు వివేకము కూడా కోల్పోయినాడు గదా! దానికి కారణం దురహంకారమే గదా!

మరికొన్నాళ్ళు పోయిన తరవాత దక్షుడు ఒక యజ్ఞమును చేయ తలపెట్టెను. అందుకు దేవతల నందరికి నారదాది మహర్షులకు బ్రహ్మావిష్ణువులకు ఆహ్వానములు పంపించెను. శివునికి కక్షతో ఆహ్వానము పంపలేదు అందరూ యజ్ఞానికి హాజరైనారు. ఆ యజ్ఞ విషయము తెలిసి పార్వతి తనభర్తతో ఆ యజ్ఞానికి వెళదామని అడిగినది. పిలవని పేరంటానికి వెళ్ళకూడదని వారించినాడు. కాని తండ్రి చేయు యజ్ఞానికి పిలవకపోయినా పుట్టింటికి వెళ్ళడానికి నాకు తప్పులేదేమో నేనైనా వెళ్ళడానికి అనుమతి ఇవ్వవలసినదిగా కోరినది. సరే వెళ్ళమని తోడుగా నందీశ్వరుని పంపి అతనిని యజ్ఞవాటిక లోనికి వెళ్ళవద్దని బైటనుండి లోపల యేమి జరుగుతున్నది తెలుసుకుని రమ్మని మహేశ్వరుడు చెప్పినాడు.

పార్వతి లోపలకు వెళ్ళగానే నీకు ఆహ్వానము పంపలేదుగదా నీవెందుకు వచ్చినావని దక్షుడనగా "శివుడు లేకుండా యజ్ఞమెలా చేద్దామనుకున్నావు? నాకు ఆహ్వానము పంపకపోయినా నేను పుట్టింటికి రావడం తప్పా?" అని అడిగింది పార్వతి. అక్కడవున్న బ్రహ్మావిష్ణువు, మహేంద్రుడు నారదాది మహర్షులందరూ శివుని ఆహ్వానించమని దక్షునికి సలహాయిచ్చినారు. దానితో దక్షుడు రెచ్చిపోయి శివుడు లేకుండానే యీ

యజ్ఞము జరగాలి అతనిని ఆహ్వానించనని శివుని మరీమరీ దూషించినాడు. శివునిపై అటువంటి దూషణలు విని శివుని ముఖం ఎలాచూడను అని యోగాగ్నిని రగుల్చుకొని దానిలో పార్వతి భస్మమైనది. అది చూచిన నందీశ్వరుడు తిరిగి వెళ్ళి జరిగిన వృత్తాంతము శివునితో చెప్పినాడు. మహేశ్వరుడు ఉగ్రుడై జటాఝూటమును తీసి వీరభద్రుని సృష్టించి ఆయజ్ఞమును నాశనము చేసి రమ్మని పంపినాడు. ఆవీరభద్రుడు ఆయజ్ఞము వద్దకు వెళ్ళి దక్షయజ్ఞమును నాశనము చేసి దక్షుని తల నరికినాడు.

ఇటువంటి సన్నివేశములను బట్టి ఆయాలోకములలో జనన మరణములు గలవనియు సుఖశాంతులు లేవనియు, కక్షలు కార్పణ్యములు అహంకారములు దురహంకారములు ప్రతీకారములు ఉన్నవనియు అక్కడ నిత్యశాంతి ఎవరికి వుండదని తెలుసుకొనవచ్చును.

నిత్యశాంతిలేని స్వర్గలోకము దేవలోకములు యెందులకు యజ్ఞయాగాదు లెందులకు అని ఆలోచించి తత్త్వజ్ఞానము ముఖ్యమని గ్రహించి బ్రహ్మవిద్యగురించి ప్రయత్నించవలెను.

**కీర్తన తాళము మిశ్రచాపు**

అహములేని శాంతమే సౌఖ్యమ్మురా
అహము నిజ గురు పరముజేసిన
శుద్ధ శాంతమె నిత్యశాంతి ||అ||

1. జనన మరణపు బాటదాటి - జన్మరాహిత్యమ్మునొందుట
తన్మయముతో గురునిచేరక - జన్మలో సాధ్యమ్ముకాదుర ||అ||

2. శుద్ధ శాంతము కలిగియుంటే - మూడుగుణములు మాయమౌను
ఆరుశత్రులు పరుగుతీయును - పరమ సఖమే నిలిచిపోవును ||అ||

3. పరమ సుఖమును మించినట్టి - సుఖములేదే లోకమందు
లోక భ్రాంతి కొరకు నీవు - పిచ్చి వేషాలేయబోకుము ||అ||

4. మూడుకోట్ల దేవతలు నీ - అహము నెన్నడు బాపలేరు
పరమగురుడే అహము బాపి - ఇహపరము దాటించివేయును. ||అ||

5. వెంకటేశ్వర రాజయోగి - నడచినట్టి రాజమార్గము
అడుగులో అడుగేసి నడచిన జనన మరణములుడిగి పోవును ||అ||

# బ్రహ్మావిద్య నెందుకు అభ్యసించాలి?

మానవుడు ప్రతిజన్మకు తల్లిగర్భమందు జనన మందేవరకు మగ్గుట - పుట్టుట బాల్యము యౌవ్వన కౌమారములలో పూర్వ జన్మ కర్మపలములైన ప్రారబ్ధ కర్మమను కష్ట సుఖములననుభవించుట ముసలి తనములో క్షీణించుట నానావ్యాధుల ననుభవించి చివరికి తన శరీరమును విడువలేక తప్పనిసరియైన మరణమును పొందుట తిరిగి పూర్వజన్మకర్మ ఫలమనే ప్రారబ్ధముతో పుట్టి ప్రారబ్ధ ఫలమననుభవించుట, అనే జనన మరణముల నుండి తప్పించుకొనలేక పోవుట. దీనికి కారణము అవిద్య.

కనుక శ్రీసద్గురుని ఆశ్రయించి బ్రహ్మావిద్యను పొంది అహంకార మమకారములను నిర్మూలించుకొని జననమరణ స్థితినుండి తప్పించు కొనుటయే అవిద్యను తొలగించుకొనుట. అదే నిత్యశాంతిని కనిగియుం డుట. భూలోకమందు ఈ బ్రహ్మావిద్యను పొందుట మానవులకే సాధ్యము. ఆవిధముగా బ్రహ్మావిద్యను పొందినవారు భయము, గర్వము, విచారము, ఆలోచన, ఈర్ష్య, అసూయ, కష, క్రోధము మొదలైన అరిషడ్వార్గాలు శ్రీసద్గురుని వలన నిర్మూలించుకొని నిత్యశాంతిని కలిగియుందురనుటలో సందేహములేదు. అదే జన్మరాహిత్యము. పూర్వజన్మపుణ్య సుకృతమున గాని సద్గురుని చేరుట బ్రహ్మావిద్యనభ్యసించుట జరగదు. బ్రహ్మావిద్యనభ్యసించనిదే అవిద్య తొలగదు. కనుకనే బ్రహ్మావిద్యనభ్యసించనివాడు యెంతటి పండితుడైనా పశువుతో సమానుడని ద్విపాద పశువని గురుగీతలో మహేశ్వరుడు పార్వతికి చెప్పిన శ్లోకము ఉదాహరణ.

**304.** శ్లో॥ నజానన్తి పరం తత్త్వం గురుదీక్షాపరాఙ్ముఖాః।
భ్రాన్తాః పశుసమా హ్యేతే స్వపరిజ్ఞాన వర్జితాః॥

తా॥ బ్రహ్మజ్ఞానము లేనివాడు ద్విపాద పశువనియే చెప్పవచ్చును. అని తెలుపుచున్నారు. గురుదీక్షను గురువుద్వారా గ్రహించక పరతత్వమును తెలియజాలరు. గురుదీక్షలేకుండిన జ్ఞానోత్పత్తికాజాలదు. గురుదీక్షను పొందినప్పుడే మూలాజ్ఞానము నశించును. క్రమముగా స్వస్వరూపజ్ఞాన

వముదయించును. ప్రచండమార్తాండునివలె సర్వవ్యాపకమై చిదాకాశ మందఖండ తేజోరూపమై బాసిల్లును. గురుదీక్షను పొందక గురుదేవుని ఉపాసించక వుండువాడు, బ్రహ్మ స్వరూపమగు ఆత్మజ్ఞానానుభవము లేనివాడగుటచే పశుసదృశుడు. అనగా ద్విపాద పశువనియే అందురు.

కొందరు అణిమాదిసిద్దులను అభ్యసించి ఏవో కొన్ని గారడీ విద్యలను చూపించి బాబాలుగా వెలుగొందుచు జనాకర్షణ చేస్తున్నారు. ఎంతటి పండితుడైన మహామహులైనా, రాజకీయ వేత్తలైనా మూఢనమ్మికలతో వీరికి ఆకర్షింపబడతారు దీనినే అవిద్య అంటారు. గారడీ విద్యలు గీతాచార్యుడైన శ్రీకృష్ణుని కంటె ఎక్కువగా యెవ్వరూ చేయలేదు. యీవిషయము ముందుగా చెప్పబడియేయున్నది.

ఒక వ్యక్తి హరికథలను అభ్యాసము చేసి రామాయణమునుగాని, మహాభారతమును గాని 40రోజులు దేనినైననూ చెప్పిప్రజలను ముగ్ధులను చేయవచ్చును. అలాగే కొందరు భాగవతములోని కథలను చెప్పవచ్చును ఒకడు ఒకభాషలోగాని, కొన్నిభాషలలోగాని మహాపాండిత్యము సంపాదించవచ్చును. అటువంటి మహాపండితులలో కొందరు కవులుగాను, అష్టావధానులుగాను, శతావధానులుగాను పేరు ప్రతిష్టతలు, సంపాదించ వచ్చును. కొందరు భగవద్గీత మొదలైన గీతలను వేదములను పురాణములను చదివి చెప్పి వాని అర్ధములు, తాత్పర్యములు, వ్యాఖ్యానములు చెప్పిప్రజామన్ననలను పొంది గొప్ప గొప్ప సన్మానములను, అవార్డులను పొందవచ్చును. కొందరు లలిత కళలలో పేరు ప్రతిష్టలు పొందవచ్చును.

కొందరు యోగాభ్యాసము చేసి అణిమాదిసిద్దులను పొంది ఆశ్చర్యకరమైన గారడి విద్యలు చూపించవచ్చును. అనగా ఒక చోట కనిపించిమాయమై మరియొక చోట కనిపించవచ్చును. పరకాయ ప్రవేశము చేసి చూపించవచ్చును. మనిషిని కుక్కగాను, చిలుకగాను , కుక్కను మనిషిగాను చేసి చూపించవచ్చును. చేతిని గాలిలోనికి పైకెత్తి విభూతిని గాని వస్తువులనుగాని చేతిలోనికి ఇంద్రజాలముగా రప్పించి చూపించవచ్చును. నోటిలోనుండి ఆత్మలింగాన్ని తీయవచ్చును. ఇవన్నియు ఇంద్రజాల గోకర్ణ గజకర్ణ విద్యలే. అనగా అవి లోకమున గల 64 విద్యలలోనివే గాని 65వ విద్యఅయిన బ్రహ్మవిద్య కాదు. కోటి విద్యలు కూటికొరకే అనే నానుడి

తెలియని వారుండరు. పైన చెప్పబడిన 64 విద్యలలో ఏవిద్య అయినా కూటికొరకే అని తెలుసుకొనవలెను. 84 లక్ష ల జీవరాసులలో మానవజన్మ తప్ప తక్కిన జీవులన్నియు తెల్లవారితే ఆహారం కొరకు పాటుపడని జీవి లేదు కొన్ని జీవులు పగలు కొన్ని జీవులు రాత్రులందు ఆహారము సంపాదించు కుంటాయి. పైజెప్పిన విద్యలవలన అహము పెరుగునే గాని పోదు వీటివలన జన్మరాహిత్యము కాదు అహంరహితమే బ్రహ్మావిద్య. అదే జన్మరాహిత్య స్థితికి మార్గము.

కొందరు మేము అవతార పురుషులమని చెప్పుకొని ప్రచారము చేయించుకొందురు. పూజలందు కొనుచు పరోపకారము అను నినాదముతో ధనమును అపారముగా సంపాదించుకొందురు. ఈవిధముగా కోట్లాది ధనము సంపాదించుకొందురు. ఇటువంటి వారి ప్రచారము విచిత్రము. కొందరు మాసపత్రికలను నడుపుచూ వారి మహిమలను కథలను ఆపత్రికల ద్వారా ప్రచారము చేసికొందురు. శిరిడిసాయిబాబా, వెంకటేశ్వరస్వామి దేవాలయములవారు, (తిరుపతి.) సత్యనారాయణస్వామివారి దేవాలయము (అన్నవరం), సంతోషమాత దేవత యొక్క ప్రచారములు కనకదుర్గాలయము (విజయవాడ) ఇటీవల నేను చూచిన కరపత్రములు విచిత్రము. అదెట్లనగా ఉదా: "శిరిడి సాయిబాబాను నేను మొక్కుకున్నాను. నాకు 20రోజులలో 4లక్షలు వచ్చినవి. అని మరి కొన్ని విషయములతో కరపత్రములు అచ్చువేయించి దానిలో యీ కరపత్రము చదివిన వారు యిదే విధముగా 1000 కాపీలు అచ్చువేయించి పంచి పెట్టిన యెడల వారికి 20 రోజులలో అనుకున్నకోరిక నెరవేరును." ఇటువంటివి ఈ మధ్యయెక్కువగా ప్రచారములోనికి వస్తున్నవి.

రాముడు, కృష్ణుడు అవతారపురుషులు అని అందరికి తెలిసిన విషయమే ప్రపంచములో పుట్టిన ప్రతి జీవికి మానవులకు, పుట్టిన వెంటనే మాయా ప్రభావములు కలుగును. దానితో అజ్ఞానము కలుగును అదే అహంకారము దానినే అవిద్య అంటారు. ఎటువంటి అవతారపురుషులైన ప్పటికి అవిద్య అనే అహంకారము నిర్మూలనము చేసుకొన్న తర్వాతనే బ్రహ్మజ్ఞానులగుటకు అర్హతకలుగును.

కొందరు బ్రహ్మజ్ఞానము కొరకు గురువులవసరం లేదు మామనసే

మాకు గురువు అని అజ్ఞానము అనే అహంకారముతో చెప్పుకొందురు. అదే అవిద్య. మనస్సు చపలత్వముగలది. బ్రహ్మజ్ఞాన ము లేనిదే అందుకు గురువు లేనిదే అది సరియైన స్థితికిరాదు. కనుకనే శ్రీరాముడు వశిష్టుని, శ్రీకృష్ణుడు సాందీపుని గురువులుగా పొందిరి. వారి వల్లనే యోగావాసిష్టము భగవద్గీత లు అనే గ్రంధములు, ఉద్భవించినవి. బ్రహ్మవిద్య కు అవే ప్రపంచానికి సాక్ష్యము, ఆధారము. ఇటీవల కలికి భగవాసుని ప్రచారము జరుగుచున్నది. దానిద్వారా రకరకములుగా సభ్యత్వములు వగైరాలకు ఒక్కొక్క రేటుతో ధనమును ప్రోగుచేస్తూ ఉన్నారు. ప్రజలు మాయా మోహితులు కాబట్టి ఇటు వంటి మాటల ప్రచారమునకు ఆకర్షింపబడి ధనమును వెచ్చించి భక్తులగుచున్నారు.

కలికావతారము లోగడ ఏప్పుడో జరిగినది. ఆకలికి బ్రహ్మకు సంభాషణ జరిగినది. పాండవుల మనుమడు అయిన పరిక్షిన్మహారాజుతో కవి కలిసినప్పుడు పరిక్షిత్తు కలిని ఈ లోకమును విడిచిపొమ్మని ఇక్కడ నీవు పనికిరావని ఆజ్ఞాపించగా పరిక్షిత్తును కలి బ్రతిమాలి బంగారముతో సహా కొన్ని చోట్ల ఆశ్రయము కల్పించవలసినదిగా కోరినాడు. పరిక్షిత్తుకు సర్పగండము శృంగివలన కలి కల్పించినాడు అని భాగవతములో పోతన వ్రాసినాడు. ఇప్పుడు మరల కొత్త కలికావతారమేమిటి? కాని అటువంటి భక్తులు అహంకారమనే అవిద్యను తొలగించుకొనలేరు ఆవిషయము వారికి తెలియదు. వారికి ఆవిధముగా నిత్యశాంతి కలుగుటలేదు. ప్రస్తుతము భక్త్యానందముతో కాలముగడుపు చున్నారు. కొన్నాళ్ళ తరువాత మరియొక అవతారపుషుడు బయలుదేరతాడు. అపుడు మరల అతనికి భక్తులవుతారు. ఈవిధముగా నిలకడలేని భక్తితో మనోనిగ్రహత లేక కోరికలతోను మొక్కులతోను కాలము గడుపుతున్నారు. కాని జనన మరణములను కష్ట సుఖములను దాటులేక పోవుచున్నారు. నిత్యానందము జన్మరాహిత్యము అనుమాట గ్రహించలేని స్థితిలో ఉన్నందున మూఢులగుచున్నారు.

**ఉదా: భగవద్గీత 7వ అధ్యాయము విజ్ఞానయోగము.**

**23.** శ్లో॥ అన్తవత్తు ఫలంతేషాం, తద్భవత్యల్పమేధసామ్ ।
దేవాన్ దేవయజోయాన్తి మద్భక్తా యాన్తి మామపి ॥

తా॥ అల్పబుద్ధి కలిగిన వారి యొక్క ఫలము నాశవంతమైనది. అనగా దేవతలను పూజించువారు దేవతలనే పొందుచున్నారు. తిరిగి జన్మించు చున్నారు. నాభక్తులు (గురుభక్తులు) నన్ను పూజించువారు నన్నే పొందు చున్నారు. పరబ్రహ్మమందే లీనమగుచున్నారు. అనగా సద్గురుని సేవించి బ్రహ్మవిద్య నభ్యసించిన వారు జన్మరాహిత్యమునుపొందుచున్నారు.

అల్పాధికారములు అల్పజీవితములు గలిగిన దేవతలను నమ్ముకొని శాశ్విత పరమాత్మస్థితిని విడిచిపెట్టినవారు అల్పబుద్దులేకదా! ప్రపంచమున యే వస్తువైనను అతడింద్రుడైనా, చంద్రుడైనా సరే అది దృశ్యవస్తువులలో చేరియున్నది. కనుక కాలక్రమమున నశించిపోవును. దృగ్ వస్తువు అగు ఆత్మ ఒక్కటే ఈ ప్రపంచమున ఏకైక అవినాశ వస్తువు కనుక విజ్ఞానులు దానికొరకు అన్వేషించుదురు. సద్గురుని ఆశ్రయించెదరు.

దేవతల నారాధించువారు కోరికల కొరకు మాత్రమే కనుక వారికి అహంకారమొదలదు.

పరబ్రహ్మ స్వరూపులైన ఓ మానవులారా మీరు పంచభూత సమ్మేళనా జనితమైన దేహపంజరములుకాదు. విశ్వవ్యాప్తమగు అఖండాత్మ స్వరూపులు కనుక మీస్వరూపమును మీరు తెలిసికొనుటయే మోక్షము. ఆవిషయమును తెలిసికొనుటకే బ్రహ్మవిద్యనభ్యసించి తీరవలెను. అందుచేత సద్గురుని ఆశ్రయించవలయును. సద్గురువనగా సుద్ధసత్త్వ సంపన్నుడు, త్రిగుణాతీతుడు. బ్రహ్మవిద్యాదురంధరుడు, బ్రహ్మవిష్ణుమహేశ్వరుల కతీతుడు శబ్దస్పర్శరూపరస గంధములులేని పరబ్రహ్మ స్వరూపుడు అటువంటి సద్గురుడు రూపములో ఇటువంటి వాడని గ్రహించుట కష్టము. అనగా ఆయన సామాన్యునివలెనే కనబడును. అనగా ఆయన వేష భాషలకతీతుడు. ఆయన బోధగురువే గాని బాధగురువుగాదు. అందుచేతనే ఈ బ్రహ్మవిద్యను అభ్యసించవలసివున్నది.



# బ్రహ్మావిద్య అనగానేమి?

బ్రహ్మ విద్య అనగానేమి అని ముందుగా తెలిసికొనవలెను. అదే తన్నుతాను తెలిసికొనెడి విద్య. ఇదే జన్మరాహిత్యమునకు మార్గము. జన్మరాహిత్యమనగా భూమిపై జన్మించిన మానవుడు తనపూర్వజన్మ కర్మఫలమును అనగా ప్రారబ్ధమునననుభవించుచూ బ్రహ్మ విద్యనభ్యసించుట వలన కర్తృత్వము అనగా అహంకారము నశించును. దానితో దేహ భ్రాంతి, శాస్త్ర భ్రాంతి లోక భ్రాంతి నశించును. మరియు ఈజన్మలోచేసిన కర్మము వలన వచ్చు కర్మఫలము కూడా నశించును. అనగా ఆగామి సంచిత ప్రారబ్ధములలో ఆగామి సంచితములు నశించును. దానివలన సూక్ష్మశరీరము నశించును. (సూక్ష్మ శరీరమనగా శరీరములను మార్చునది) అందుచేత ఈదేహము నశించిన తరవాత తిరిగి జన్మయుండదు. కాని శరీరమున్నంత వరకు ప్రారబ్ధకర్మమునను. భవించవలసినదే అనగా ప్రారబ్ధకర్మఫలమున్నంత వరకు శరీరముంటుంది. బ్రహ్మవిద్య నభ్యసించువాడు జీవించి వుండగా సుఖ దుఃఖములు మానావ మానముల కతీతుడై యుండును. దానికి కారణం కర్తృత్వరహితమే అనగా అహంకారమమకారములు నశించి హృదయ గ్రంధి వీడును. అందువలన దేహవాసన శాస్త్రవాసన లోకవాసన అను వాసనాత్రయము, యీషణ త్రయము నశించును. అదే జీవసమాధి. అదే జన్మరాహిత్యము, ఆవిధముగా సుఖ దుఃఖములు. మానావమానముల కతీతుడు కానియెడల బ్రహ్మవిద్య సరిగా అర్థముకాలేదని తెలుసుకొనవలెను.

**ఉదా: భగవద్గీత 9వ అధ్యాయము రాజవిద్యా రాజగుహ్యాయోగము.**

2. శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥

తా॥ ఈబ్రహ్మజ్ఞానము విద్యలలోకెల్ల శ్రేష్ఠమయినదియు, సర్వోత్కృష్ట మైనదియు, పవిత్రమైనదియు, ప్రత్యక్షముగ తెలియదగినదియు, ధర్మయుక్త మైనదియు అనుష్ఠించుటకు మిగుల సులభమైనదియు, నాశరహితమైనది యు అయియున్నది.

వ్యాఖ్య॥ ప్రపంచములో 64 విద్యలుగలవు కాని అవియేవియు జీవుని జనన మరణముల నుండి తప్పింపజాలవు. అహంకారమును నిర్మూలింప జాలవు.

అరువది యైదవది బ్రహ్మవిద్య. ఇదియే అట్టిపనిని చేయగలదు. మరియు ఆ దృశ్యవస్తువులన్నియు అశాశ్వతములు. కావున వానిని గూర్చిన విద్యలు యేవియు కూడా మనుష్యునకు పరిపూర్ణ శాంతిని కలుగజేయజాలవు. శాశ్వతమగు బ్రహ్మము (ఆత్మ) ను గూర్చిన విద్యయే శాంతిని కలగజేయగలదు. కనుకనే బ్రహ్మవిద్య విద్యలలో కెల్లా శ్రేష్టమని రాజవిద్యయని చెప్పబడినది. మరియు లోకములో పవిత్ర తమమైనట్టి పరమాత్మ వస్తువును ప్రతి పాదించునది అగుటచేత ఇది పవిత్రమైనదియేయగును. ప్రపంచము లోని విద్యలలోకెల్ల అత్యుత్తమ విద్యయగుటచే దీనిని రాజ విద్యయందురు. దీనిననుష్టించు యోగమును రాజయోగమందురు.

బ్రహ్మవిద్యను ఆచరించుట చాల తేలికయని అనగా ధనవ్యయము గాని శ్రమగాని లేనిది. మనస్సునందలి దుస్సంస్కారము లను వాసనాత్రయ మును ప్రయత్నపూర్వకముగా సద్గురుని ఆశ్రయించి తొలగించుకొనినచో (అనగా తన యొక్క తనుధనమాన ప్రాణములను సద్గురునకు త్రికరణశుద్ధి గా సమర్పించుకొనినచో) ఇక స్వస్వరూప సాక్షాత్కారము నందేలాంటి పరిశ్రమయు లేదు. కనుకనే శాస్త్రములందీ ఆత్మానుభూతి పుష్పములను నలుపుట కంటెను గూడా సులభమని చెప్పబడినది. బ్రహ్మానుభవము అతిసులభమైనది. ఈవిధముగా బ్రహ్మవిద్య యందు శిష్యులకు ధైర్యము చెప్పబడినది. ఈ విద్య ధర్మములకు మూలమున్ను సనాతనమున్నూ అయియున్నదని చెప్పబడినది.

కనుక సద్గురుని చేరిన సాధకుడు ఏక్షణ మున బ్రహ్మ విద్యను అనుభూతమొనర్చుకొనునో ఆ క్షణముననే అతడు సాక్షాత్ బ్రహ్మమే యగును. ఇది ఫలితమును గలగజేయునో లేదో అను సందేహమవసరము లేదు. తన్నుతాను తెలుసుకొనుటుకు తానెవరో తెలుసుకొనవలెను. తాను అనే స్వరూపము శబ్దస్పర్శరూపరస గంధములు లేక యున్నది.

**ఉదా: భగవద్గీత 2వ అధ్యాయము సాంఖ్యయోగము.**

24. శ్లో॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవచ
నిత్యస్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః

**తా॥** అతడు(ఆత్మ) ఛేదింపబడజాలడు దహింపబడజాలడు, తడుపబడజాల డు, ఎండింపబడజాలడు. ఇతడు నిత్యుడు సర్వవ్యాపి, స్థిర స్వరూపుడు నిశ్చలుడు, సనాతనుడు.

**వ్యాఖ్య ॥** పంచభూతములు పాంచ భౌతిక వస్తువునే బాధింపగలవు కావున

ఆపంచభూతముల ప్రభావమేమియు అతనిపై బడదు . అదే నీ యధార్థమైన స్వరూపము. దానిని తెలిసుకొనుటయే తన్నుతాను తెలిసికొనుట. దీనిని సద్గురుని సహాయముతోనే తెలిసికొనవలెను. వేరుమార్గములేదు నిత్య, సర్వగతః అను రెండు పదములచే ఆత్మ కాలములకు దేశమునకు అతీతుడని వివరింపబడినది. ఎల్లకాలములందుండువాడు నిత్యుడు. ఎల్లదేశములందుం డువాడు సర్వగతుడు. దేశకాలముల రెండింటియందును వ్యాపించియుండి ఆత్మ వానికతీతుడై యున్నాడు.

**భగవద్గీత ౨వ అధ్యాయము. సాంఖ్యయోగము.**

**25.** శ్లో॥ అవ్యక్తో ఽయమచిన్త్యో ఽయమవికార్యో ఽయముచ్యతే,
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి.

**తా॥** ఈ ఆత్మ ఇంద్రియములకు గోచరము కానివాడు మనస్సుచే చింతింప శక్యము కానివాడు వికారములు బొందింపదగని వాడునని చెప్పబడుచు న్నాడు. కావున ఈ ప్రకారముగ తెలిసికొని నీవు దుఃఖింపకుము

**సద్గురుడనగా పరమగురుడు. ఉదా: గురుగీత**

**287.** శ్లో॥ అఖండైక రసంబ్రహ్మ నిత్యముక్తం నిరామయమ్ ।
స్వస్మిన్సన్దర్శితం యేన స భవేదస్య దేశికః ॥

**తా॥** గురువనగా నెట్టివాడో చెప్పుచున్నారు. నిత్యనిర్మలమును భవరోగవర్జితము ను నిత్య సర్వబంధ రహితమును ముక్తమును, అపరిచ్ఛిన్నమును పరిపూర్ణము, కేవలామృతరసమునైన పరబ్రహ్మము తనలోనే నిత్యము ప్రకాశించుచున్నదని యే మహాత్ముడు శిష్యునకు సాక్షాత్కరింప జేయునో ఆమహనీయాత్ముడే దేశి కేంద్రస్వామి యని దెలియవలయును. దేశికుడనగా పరబ్రహ్మతత్త్వము నుపదేశించు వాడని యర్థము. అట్టి నిర్గుణతత్వమును శిష్యుడు పొంది నిత్యముక్తుడును నిరామయుడును కేవలాద్వైత తత్వామృతరస స్వరూపుడును నగు పరమాత్మయొక్క స్వరూపమును సాక్ష్యాత్కరించుచు పరమానంద పరిపూర్ణుడగుచున్నాడు. సచ్చిత్సుఖ స్వరూపుడగుచున్నాడు. గురూపదేశము లేనపుడు తాను పరితపించుచుండెను. ఒకానొక దరిద్రుడు తన ఇంటిలో నిధియున్నను తెలిసికొనడు దారిద్ర్య బాధచే పీడితుడగుచుండె ను. నిధిజ్ఞుడు వచ్చి నిధిజూపి యెత్తియిచ్చెను. అప్పుడు వానికి గలుగు ఆశ్చర్యమునకు

నానందమునకునూ అంతుగలదా! అట్లే తన హృదయములో నున్న పరబ్రహ్మమును శ్రీగురుదేవుడు శిష్యునకు సాక్షాత్కరింపజేసెను. అప్పుడా శిష్యుడు శ్రీ గురుదేవునికి జేయు స్తోత్రవయులకు వానికి జనించిన పరమానందమునకు పరిమితి లేకపోయెను. అయ్యో నాయజ్ఞానమేమన వచ్చును? నాయందున్న పరమాత్మను జూడకుంటినిగాదా యని ఆశ్చర్య పడును. గురుదేవుని యందు పరమ కృతజ్ఞుడైయుండును. కనుక పరమ తత్వోప దేశికుడే దేశికవరుడని తెలియవలెను.

**ఉ॥ గురుగీత :**

**288.** శ్లో॥ జలానాం సాగరో రాజాయథాభవతి పార్వతి।
గురూణాం తత్ర సర్వేషాం రాజా౽యం పరమోగురుః

**తా॥** పరమప్రాప్యమగు గురువరేణ్యుని తెలుపుచున్నారు. ఓపార్వతీ! వినుము. జలములన్నింటికిని ఆశ్రయమ్మైరాజై సముద్రమున్నది. నదులలోనికిగాని వేనికిగాని యుదకము సముద్రముల ద్వారానే వచ్చుచున్నవి. అచ్చటనే చేరుచున్నవి. అట్లే ప్రజలు సర్వదా సంతోషపెట్టు రాజు నాశ్రయించి యుంటున్నారు. ఆప్రకారమజ్ఞాన నాశనము గావించి పరతత్వమును బోధించి పరమానందమును గావించు శ్రీగురు దేవుడే గురూణాంగురువై పరమగురుడని చెప్పబడుచున్నాడు. అట్టి మహాత్ముని గురువు లెల్లరు నాశ్రయించియున్నారు. అచ్చట నుండియేపరమ గురువు యొక్క అను గ్రహమును బడసియే పరతత్వము గైకొనుచున్నారు. కాని పరమ గురువనగా సత్యపరబ్రహ్మ స్వరూపుడై గురువుల కెల్లను రాజైయున్నాడు.

**మరియొక ఉదాహరణ గురుగీత.**

**289.** శ్లో॥ మోహాది రహిత శాన్తో నిత్యతృప్తో నిరాశ్రయః।
తృణీకృత బ్రహ్మావిష్ణు వైభవః పరమోగురుః॥

**తా॥** మూలాజ్ఞానమునకు పరమకారణములగు శోకమోహాదులను రహిత మొనర్చినవాడును అనగా నిశ్శేషముగా మూలాజ్ఞానమగు మూలావిద్యను ధ్వంసమొనర్చినవాడును. విశుద్ధ తత్వస్వరూపుడును సకల చిత్తేంద్రియ ప్రవృత్తులను శమింపజేసిన వాడగుటచే పరమశాంతుడును సకల తృప్తులకు నిలయమ్మైన పరమ విశ్రాంతి ధామమ్మైన పరబ్రహ్మ మందు నిరంతరము

రమించువాడగుటచే నిత్యతృప్తుడును ఏఆశ్రయములేక సర్వాధారుడై సర్వాధిష్ఠానమై యుండువాడును త్రిగుణములను గూడా నతిక్రమించి నిర్గుణ నిరుపాధిక వేదాంత తత్త్వవైభవములు గలవాడగుటచే కొంత కాలమునకు నశించునట్టి బ్రహ్మ విష్ణు మహేశ్వర స్థానములను గూడ తృణీకరించిన వాడును వేదాతీత కాలాతీతమగు అఖండ జ్ఞానవైభవోపేతుడును కేవల దక్షిణామూర్తి స్వరూపుడునగు దివ్య తేజోమూర్తియే పరమ గురువనబడు చున్నాడు. అట్టి మహాత్ముని శరణ్యములభించినచో పరబ్రహ్మ పదవి మరియొకటి లేదు. అదియేయనంత సుఖ స్వరూప పరమానంద పదవి.

**ఉ:గురుగీత.**

**290.** శ్లో॥ సర్వకాల విదేశేషు స్వతంత్రో నిశ్చల స్సుఖీ ।
అఖండైక రసా స్వాద తృప్తోహి పరమో గురుః ॥

తా॥ పరమ గురుస్వరూపమునే నిర్ణయించుచున్నారు. సర్వకాల సర్వావస్థల యందు స్వాతంత్ర్యము గలవాడును అనగా సర్వకాలవములకును సర్వదేశములకును అతీతుడై స్వతంత్రుడై ప్రకాశించువాడును అచలుడును నిత్యసుఖియును, కేవల పరబ్రహ్మానందామృత రసాస్వాదము చే తృప్తుడైన వాడును, పరతత్త్వమును ఎరింగినవాడును, అగు సర్వశ్రేష్ఠుడు పరమ గురువని తత్త్వజ్ఞులు పలుకుచున్నారు. అట్టి పరమగురుని ఆశ్రయించిన శిష్యుడు జన్మరాహిత్యమును పొందును.

ఇప్పటివరకు చెప్పిన విషయములు అవగాహన చేసుకుని బ్రహ్మవిద్య అవసరమాకాదా అని తెలిసికొనగలరు.

ఇట్లు
గ్రంధకర్త.



# పరిపూర్ణ బ్రహ్మవిద్య

అథాతో బ్రహ్మజిజ్ఞాసా అను ప్రథమ బ్రహ్మ సూత్రము నందు తెలియజేసి నట్లు సాధన చతుష్టయ సంపత్తిని సద్గురుని ద్వారా పొందిన అనంతరమే మానవుడు బ్రహ్మ విద్యకు అధికారి. అట్లుకాని యెడల అధికారి కాడు. అనగా బ్రహ్మవిద్యను సాధించలేడు.

**ఉదా: భగవద్గీత 2వ అధ్యాయము సాంఖ్యయోగము.**

**29.** శ్లో॥ ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన మాశ్చర్య వద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్య వచ్చైన మన్యశ్శృణోతి శృత్వాప్యేనం వేదన చైవ కశ్చిత్॥

తా॥ ఆత్మ ఇంతటి ప్రసిద్ధమైన వస్తువైనను దానిని ఒకానొకడు ఆశ్చర్యమైన దానిని వలె చూచుచున్నాడు. మరి యొకడు ఆశ్చర్యమైన దానిని వలె దీనిని గూర్చి చెప్పుచున్నాడు. అట్లే వేరొకడు ఆశ్చర్యమైన దానిని వలె దీనిని గూర్చి వినుచున్నాడు. అట్లు చూచియు, చెప్పియు, వినియుకూడా ఒక్కడునూ దీనిని గూర్చి తెలిసికొనుటలేదు సాక్షాత్తుగా అనుభవించుట లేదు. దానికి కారణం సాధన చతుష్టయ సంపత్తి లేక పోవడమే.

వ్యాఖ్య॥ బ్రహ్మవిద్య మౌఖిక వర్ణన (థియరీ) లతో పరిసమాప్తము కాదు. అది ఆచరణ పూర్వక విజ్ఞానము( ప్రాక్టికల్ సైన్సు) దానిని గూర్చిన ప్రతివిషయము కూడా ప్రత్యక్షముగా అనుభూత మొనర్చుకొనిన యెడలనే పూర్ణముగా తెలియును. కాని అట్టి అనుభూతి లభించుటకు అనేక జన్మల నుండి సంపాదించిన సుకృతము (పుణ్యాపరిపాకము), చిత్తశాంతి, దేహవాసన, శాస్త్రవాసన, లోకవాసన అను వాసనా రాహిత్యము అవసరము కనుక సాధనచతుష్టయ సంపత్తి సద్గురుని చేరి జాగ్రత్తగా అభ్యసించిన వానికి మాత్రమే బ్రహ్మజ్ఞానము నందు ప్రవేశము కలుగును. తక్కిన వారు బ్రహ్మజ్ఞానమును చేపట్టినను పూర్ణఫలితమును పొంద జాలరు. హృదయ క్షేత్రము సత్త్వగుణ ప్రధానమైయున్నచో నిర్మల దర్పణము నందు వస్తువులు చక్కగా ప్రతిబిం బించునట్లుగాను, ఉతికిన గుడ్డకు రంగు బాగుగా ప్రవేశించునట్లును, మెత్తని నేల యందు విత్తనములు శీఘ్రముగా మొలకెత్తునట్లును తనస్థితి తనకు శీఘ్రముగా, తెలియును.

ఆత్మ అనగా నేమి యని యీ క్రింద ఉదహరింపబడినది.

**ఉదా: భగవద్గీత 2వ అధ్యాయము సాంఖ్యయోగము.**

20. శ్లో॥ న జాయతే మ్రియతేవా కదాచి న్నాయం భూత్వా భవితా వాన భూయః
అజో నిత్య శాశ్వతో ఽ యం పురాణో న హన్యతే హన్యమానే శరీరే

తా॥ ఈయాత్మ ఎప్పుడునూ పుట్టుటలేదు. చచ్చుటలేదు. ఇదివరకు లేకుండి మరల క్రొత్తగా కలుగువాడుకాడు (ఉండి మరల లేకుండువాడు కాడు) ఈతడు జనన మరణములు లేనివాడు శాశ్వితుడు, పురాతనుడు. శరీరము చంపబడినను ఇతడు చంపబడుటలేదు.

వ్యాఖ్య॥ ఈ శ్లోకమును బోలినదియు కఠోపనిషత్తునందు గలదు గీత ఉపనిషత్సార మనుటకీ వాక్యములే నిదర్శనము.

శరీరము నశించినను ఆత్మ నశించదని చెప్పినందువలన శరీరము కంటె వేరై ఆత్మ సాక్షిగానున్నాడని స్పష్టమగుచున్నది. కావున మనుజుడు నశించు శరీరముతో తాదాత్మ్యము నొందక నశింపని ఆత్మయే తానని నిరంతరము భావించు చుండ వలయును. దానిచే అపరిమితమైన ధైర్యము, ఆనందము కలుగును నిర్భయత్వము జనించును. మరణ భయము పటాపంచలైపోవును. ఈవిషయం ఇంకా తేలిక పడుటకు

**ఉదా: భగవద్గీత 13వ అధ్యాయము క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగం.**

13. శ్లో॥ జ్ఞేయంయత్తత్ప్రవ క్ష్యామి యత్జ్ఞాత్వాఽ మృతమశ్నుతే
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నా సదుచ్యతే ॥

తా॥ ఏది తెలియదగిన బ్రహ్మస్వరూపమో దేనిని తెలిసికొని మనుజుడు అమృత స్వరూపమగు మోక్షమును పొందుచున్నాడో అద్దానిని బాగుగ చెప్పబోవు చున్నాను. ఆదిలేనట్టి పరబ్రహ్మమనబడునది సత్తనిగాని (ఉన్నదనిగాని) అసత్తనిగాని (లేదనిగాని) చెప్పబడదు.

వ్యాఖ్య॥ ఇక్కడ నుండి మొదలుకొని ఆరు శ్లోకముల వరకు జ్ఞేయమగు పరమాత్మ స్వరూపమును వర్ణించుచున్నారు. జ్ఞాన మాత్రముతో సంతృప్తి నొందక జ్ఞేయమును గూడా ప్రతివారును తప్పక పొంది తీరవలెను. మొదట దుర్గుణములను పోగొట్టుకొని సద్గుణములను అలవాటు చేసుకొన వలెను. తదుపరి సద్గుణములను కూడ దాటి నిర్గుణపరమాత్మ సన్నిదికి జేరవలెను. అది యొక్కటియే పరిపూర్ణస్థితి. తక్కినవన్నియు అపరిపూర్ణ స్థితులేయగును. ఇట్టి జ్ఞేయతత్త్వమును బోధించు మతములు లోకమున చాల అరుదు.

ఏలయనిన మతములలో అనేకములు సద్గుణములను మాత్రము బోధించునవియే అయియున్నవి. (మరియు మతములన్నియు సగుణారాధననే బోధించును) అట్టిస్థితి మంచిదేకాని చాలదు. సాధకుడు సద్గుణ ప్రభావముచే విశుద్ధాంతరంగుడై అంతటితో తృప్తినొందక ఇంకను పైకి పోయి కేవలము జ్ఞేయవస్తువగు పరమాత్మతోటి తాదాత్మ్యమును పొందవలెను. అదియే జీవుని చరమస్థితి. అట్టి స్థితిని చేరువరకును సాధనమెవరును వదలరాదు. కావున గీతయందు భగవానుడు జ్ఞానగుణములతో పరితృప్తిని బొందక జ్ఞేయమును గూడా జెప్పి జీవుని అద్వైత పరాకాష్ఠ వరకు గొని పోయివిడిచిరి.

అనగా సద్గురు దేవుని నమ్మి ఆయనకు ఉపదేశకాలమున తను ధనమాన ప్రాణములనర్పించిన యెడల పాపపుణ్యములు సుఖదుఃఖ ములు మానావమానములు అనే ద్వంద్వముల కతీతులగుదురు. వారికి జనన మరణముల భయముండదు. వారికి యజ్ఞయాగాదులు చేయవలసిన అవసరము లేదు ఎందుచేతననగా .

**ఉ॥ భగవద్గీత యందు 18వ అధ్యాయము మోక్షసన్యాసము.**

66. శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

తా॥ సమస్త ధర్మములను విడిచిపెట్టి నన్నొక్కనిని మాత్రము శరణుబొందుము. నేను సమస్తపాపముల నుండి నిన్ను విముక్తునిగ చేసెదను. విచారింపకుము.

అనగా నిత్యనైమిత్తికాది సమస్త ధర్మముల కంటెను కర్మములకంటెను, భగవచ్ఛరణాగతి (సద్గురుచ్ఛరణాగతి) ఎన్నియోరెట్లు అధికఫలములను గలగజేయును. అ చిన్నచిన్న ధర్మములు కర్మములు అన్నియు పుణ్యమును కలగజేయును భగవచ్ఛరణాగతి (సద్గురుచ్ఛ రణాగతి) మోక్షమునే కలగజేయును అని సద్గురునే ఆశ్రయించమని అర్జునునికి శ్రీకృష్ణుడు బోధించినాడు. కనుక సద్గురునిచేరి త్రికరణ శుద్ధిగా కర్తృత్వ రహితముగా గురుసేవ చేయు వానికి అవిద్య తొలుగును జన్మరాహిత్యమగును. కనుక యేధర్మము అనుసంరించవలసిన పనిలేదు.

## కీర్తన - ఖండ చాపు తాళము

చ॥ లేదురా గురుభక్తి సాటికేదైనా -
వాదులాడితె జనన మరణములు తప్పవు.
అన్ని ధర్మాలను విడిచి వేయక నీవు -
ఓంకార ఘీంకారమెంత జేసిన గాని ॥ లేదురా॥

1. తీర్థయాత్రలుయెన్ని తిరిగొచ్చినాగాని -
తిరుక్షౌరములు యెన్ని తరచు చేయించినా
పర్వదినములలోన పాపమొదిలించునని -
నదులలో సంద్రములో మునిగి తేలినగాని ॥లేదురా॥

2. జపతపములను జేసి ఉపవాసములు జేసి
జాగరణ లెన్నిటిని చేసినాగాని
మడిగట్టి సంధ్యలు వార్చినాగాని
దీప నైవేధ్యములు ధూపములు వేసినా ॥ లేదురా॥

3. నూతులు చెరువులు త్రవ్వించినా గాని
గుడిగోపురము లెన్ని కట్టించినా గాని
కాశికి పోయినా గంగలో మునిగినా
యజ్ఞ యాగాలెన్నో క్రమముగా జేసినా ॥ లేదురా॥

4. అష్టాంగ యోగములు చేకూరినాగాని
అష్టసిద్ధులు ముద్రగారడీ నేర్చినా
ముక్కోటి దేవతల పూజించినాగాని
ముక్కంటినే నీవు కంటితో చూచినా ॥లేదురా॥

5 వర్తమానము భూత భవిష్యత్తులను జెప్పి
ఆకాశమార్గాన విహరించినా గాని
నీటిలో నిప్పులో మునిగియుండిన గాని
జీవముతో భూమిలో సమాధైననుగాని ॥లేదురా॥

6. గడ్డాలు మీసాలు ప్రీతితో పెంచినా
కాషాయ వస్త్రాలు ధరియించి బాగుగా
వీభూతి రేఖలతో వర్ధిల్లినా గాని
గారడీలెన్నెన్నొ చేసి చూపించినా ॥లేదురా॥

7. షడ్చక్రములు దాటి సహస్రారమున జేరి
ప్రణవనాదంబనె ఓంకారమును జూచి
దశవిధపు నాదములు ఆలకించుచు భువిని
ఆయువును పెంచుచూ వెయ్యేళ్ళు గడిపినా ॥లేదురా॥

8. గురుజేరి తను ధన మాన ప్రాణములను
స్థిరము గా గురునమ్మి ధార వోసిన వెనుక
ధర జరా మరణముల భ్రాంతి నిర్మూలమే
గురుని చేరని నరుడు పరమ భక్తుండైన ॥లేదురా॥

9. శ్రీరామ శ్రీకృష్ణ శుకుడు సాందీపుడు
శ్రీధరస్వామి శివరామ దీక్షితులు
శ్రీరామ చంద్రయోగీంద్రులందరు వారి
గురుసేవ జేసి ధర తరియించినారు. ॥లేదురా॥

10. రజ్జు సర్పభ్రాంతి - కలయేర యీజగము
భ్రాంతి రహితముతోడ - శాంతి చేకూరును.
వెంకటేశ్వరరాజ యోగి చెప్పిన మాట
వేద వేదాంగములు దాటి చూపిన బాట ॥లేదురా॥



# సాధన చతుష్టయ సంపత్తి

బ్రహ్మావిద్యను బోధించు పరమ గురుని జేరి ఉపదేశమును పొంది. ఆసద్గురుని తైల ధారవంటి నమ్మికతోను భక్తితోను దేహాభిమానము లేకుండా సాష్టాంగ నమస్కారములతోను సేవిస్తూ శ్రవణ మనన నిధి ధ్యాసన పూర్వకముగా సాధన చతుష్టయ సంపత్తిని అలవరచుకొనవలెను. సాధన చతుష్టయ సంపత్తిని పూర్తిగా అర్ధము జేసుకుని ఆచరించిన యెడల బ్రహ్మావిద్య పూర్తిగా సాదించినట్లే. బ్రహ్మావిచారము నిద్రవచ్చేవరకు మరణమొచ్చే వరకు చేయుచుండవలెను. దీనివలన కారణశరీరము సూక్ష్మ శరీరమునకు స్థూల శరీరమునకు సంబంధించిన మూడువాసనలు అనగా దేహవాసన శాస్త్రవాసన, లోకవాసనలు పూర్తిగా నశించును. దానితో హృదయగ్రంధి వీడును. దానితో భ్రాంతి రహితమగును. అట్లు అభ్యసించని యెడల ఎంతటిపూర్వజన్మ పుణ్యాత్ములైనను ఈ బ్రహ్మావిద్యకు అధికారులు కారు.

**సాధన చతుష్టయ సంపత్తి వివరము**

1. నిత్యానిత్య వివేక జ్ఞానము.
2. ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము.
3. శమాది షడ్క సంపత్తి.
4. ముముక్షత్వము.

**1. నిత్యానిత్య వివేక జ్ఞానము:** సర్వాత్మరూపకమైన అనగా **84** లక్షల జీవరాసులలోను విశ్వమంతటిలోపల సూన్యములోను గల యేకాత్మ బ్రహ్మా కంటె వేరుగాదని తెలిసికొనుట యే సత్యము నిత్యము. జగత్తులో కంటికి కనిపించు దృశ్యములన్నియు అనిత్యములని తెలిసికొనుటయే నిత్యానిత్య వివేక జ్ఞానము.

నిత్యనిరతిశయానంద స్వరూపమగు బ్రహ్మాయే తన నిజ స్వరూపమని జ్ఞానము కలిగినప్పుడు అనుభవింపబడు ప్రకృతిలోని స్వప్నరూపానందము కూడా లేనిదని అనిత్యమని వివేకము కలుగును. శబ్దస్పర్శ రూప రస గంధములు లేనిదై ముల్లుగ్రుచ్చు సందు లేక విశ్వమంతట నిండియున్న పరబ్రహ్మా

స్వరూపము నిత్యమని పంచభూత సమ్మేళనా జనిత, త్రిగుణాత్మకమైన (సత్వరజస్తమోగుణములుగల) జగత్తు అనిత్య మని తెలుసు కొని ధృడముగా నుండుటయే నిత్యానిత్య వివేక జ్ఞానము.

**ఉదాహరణ: భగవద్గీత 2వ అధ్యాయము సాంఖ్యయోగము.**

16. శ్లో॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సత:
ఉభయోరపి దృష్టోఽ స్తత్త్వ నయోస్తత్త్వ దర్శిభిః ॥

తా॥ జ్ఞానులకు నిత్యానిత్య వస్తు పరిజ్ఞానము కలిగియుండును. అనగా యీదేహాది దృశ్యమంతయు నశించునది కనుక నిజముగా లేనిది. అటువంటి లేని స్వప్న జగత్తుకు ఉనికి యేకాలమందును ఉండదు. కనిపించుచున్నను. యెండమావులవలె లేనిదే అయివున్నది. ఆత్మ సత్యము. వానికి యేకాలమందు ను లేమి వుండదు. ఈయదార్థ స్థితిని జ్ఞానులు మాత్రము యెరుగుదురు. తదితరులు యీ యదార్థమును తెలిసికొనలేరు. లేనిదానికి ఉనికిని కల్పించుకొని ఉన్నదానికి లేమి కల్పించి జన్మరాహిత్య మార్గమునెరుగక నానాబాధలు పడుచున్నారు.

**కీర్తన మిశ్రచాపు**

ప॥ బ్రహ్మానిత్యం జగన్మిధ్యని -తెలుసుకోరానరవరా
నిత్యానిత్యము నెరిగియుంటే -జగమే కలయని తెలియురా ॥

1. మతములెన్నో ఉన్నవి వాని పేరులెన్నో ఉన్నవి
పేరులెన్నో ఉన్నగాని మతముల పేరులెన్నో ఉన్నగాని
దేవుడొకడే చూడరా మతముల దేవుడొకడే చూడరా ॥బ్రహ్మ॥

2. నదులు యెన్నో ఉన్నవి వాని పేరులెన్నో వున్నవి
పేరులెన్నో ఉన్నగాని నదుల పేరులెన్నో వున్నగాని
నీరు ఒక్కటే చూడరా నదుల నీరు ఒకటే చూడరా ॥బ్రహ్మ॥

3. గోవులెన్నో ఉన్నవి వాని రంగులెన్నో వున్నవి
రంగులెన్నో వున్నగాని గోవుల రంగులెన్నో వున్నగాని
పాలు తెలుపే చూడరా గోవుల పాలు తెలుపే చూడరా ॥బ్రహ్మ॥

4. జీవులెనుబది నాల్గులక్షల జీవరాసులు ఉన్నవి. వాని పేరులెన్నోవున్నవి
పేరులెన్నో వున్నగాని జీవుల పేరులెన్నో వున్నగాని
అంతరాత్మ ఒకటెరా జీవుల అంతరాత్మ ఒకటెరా ॥బ్రహ్మ॥

5. నామరూప క్రియలు లేక జనన మరణపు మాట లేక
అండపిండ బ్రహ్మాండమంతట ఎందుకదలక వున్నది
అంతరాత్మే అచలము అది బ్రహ్మమే అని తెలియరా ॥బ్రహ్మ॥

6. వెంకటేశ్వర రాజయోగి చూపినట్టి బాటకాదని
వేరుమార్గము లెన్నివెదకిన జనన మరణము తప్పదు
నిండుగా సద్గురుని నమ్మితె దేహమే నిర్మ్మలము-సందేహమే నిర్మ్మలము ॥బ్రహ్మ॥

**2. ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము:** క్షీణేక్షీణే మర్త్య లోకం విశంతి. అనుశ్రుతి స్వర్గలోక భోగము వలన కలిగెడు అనందము కూడా అనిత్యమని తెలియబడుచున్నది. నిత్యనిరతి శయానందస్వరూపమగు బ్రహ్మయే తన నిజస్వరూపము అను జ్ఞానము కలిగినప్పుడు అనుభవింపబడు ప్రకృతిలోని స్వప్నరూపానందము కూడా లేనిదని అనిత్యమని వివేకము కలుగును. అందుచేత వైరాగ్యమునకు కారణమగు చున్నది. అందుచేతనే దీనిని ఇహాముత్రార్థపలభోగవిరాగమనిరి. అనగా ఈలోకమందు కర్మజన్యాలైనటు వంటి స్రక్చందన వనితాదులతో అనగా పూలదండలు చందనములతోను కలిగిన స్త్రీలతో విషయభోగాదుల యందును పరలోకమందురంభా మొదలైన పరస్త్రీసంభోగాదుల యందున్నూ వాంతి, మూత్రపురీషణాదుల యందు అసహ్యాభావము కలిగినట్లు పైవాటి యందు ఇచ్ఛలేకుండుటయే ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము. మరియొక ఉదాహరణ

**అష్టావక్రగీత. 3వ ప్రకరణము.**

8. శ్లో॥ ఇహాముత్ర విరక్తస్య నిత్యానిత్య వివేకినః ।
ఆశ్చర్యం మోక్షకామస్య మోక్షాదేవ బిభీషికా ॥

తా॥ ఆత్మ నిత్యమని శరీరాదికము అనిత్యమని వివేచన చేసి తెలుసుకున్నవాడే వివేక పురుషుడు మరియు ఆనంద రూప పరబ్రహ్మప్రాప్తికే మోక్షమనిపేరు. అటువంటి మోక్షమును కోరు పురుషునకు భయము అనునది ఉండదు.

**మరియొక ఉ॥ అష్టావక్రగీత.**

9. శ్లో॥ ధీరస్తు భోజ్యమానో ఽపి పీడ్యమానో ఽపి సర్వదా
ఆత్మానం కేవలం పశ్యన్న తుష్యతి న కుప్యతి.

తా॥ జ్ఞానికి కోపముగాని శోకముగాని యుండకూడదు. జ్ఞానియగువాడు లోకుల దృష్టిలో భోగములనుభవించువాడువలెనున్నను లేక లోకులచేత నిందితుడై బాధింపబడుచున్నను యెల్లప్పుడు యేసమయమందును సుఖదుఃఖరూప భోగముల నుండి రహితుడై కేవలాత్మావలోకనము చేయును. ఎందుకంటే జ్ఞానికి సంతోషముగాని దుఃఖముగాని కోపము గాని ఆత్మయం దుండుటకు వీలులేదు.

సద్గురునకు ఉపదేశకాలమందు త్రికరణ శుద్ధిగా ధారవోసిన తను ధనమాన ప్రాణములనే శరీరమందు, మలమూత్రవమనాదుల యందు భ్రాంతిలేనట్లు అహంకారభ్రాంతి వీడినది. దానివలన వాసనాత్రయము, యీషణత్రయముయిన దారేషణ, ధనేషణ పుత్రేషణలు పటాపంచలగును. గురుదేవునికి సమర్పించిన యీశరీరముపై భ్రాంతిలేకున్నను తన పూర్వ జన్మ కర్మఫలము అనే ప్రారబ్ధము అనుభవించుచు సుఖదుఃఖములు, కష్టసుఖములు మొదలైన ద్వంధ్వముల కతీతుడైయుండును. అట్టి స్థితి తానుండుట లేకుండుట అనురెండూనెరుగని స్థితియేయిహాముత్రార్థ ఫలభోగవిరాగము.

**3.శమాదిషట్క సంపత్తి :** శమాదిషట్క సంపత్తి అనగా 1శమము, 2. దమము, 3. ఉపరతి, 4. తితిక్ష, 5. శ్రద్ధ, 6. సమాధానము అని ఆరువిధములు.

**1. శమము:** అంతరింద్రియమగు మనస్సు యొక్క నిగ్రహము. దానిని నిగ్రహించిన బుద్ధి, చిత్తము అహంకారము మంచి స్థితిలోనుండును. సత్వగుణము నలవరచుకొని అహంకార నిర్మూలనజేసి మనస్సును ప్రశాంత పరచుటయే శమమనబడును. సద్గురుని సహాయముతో నీయదార్థ స్వరూప మొకటున్నదని (అదే జ్ఞేయము) అది జనన మరణ రహితమై నిత్యమైయున్నద ని సందేహము లేక అహంకార మమకారము లేని స్థితిని దృఢ నిశ్చయముతో స్థిరపపర్చుట. అంతట హృదయగ్రంధి వీడి ప్రశాంతముగా నుండుటయే శమము.

**ఉదాహరణ గురుగీత**

**306.** శ్లో॥ భిద్యదే హృదయగ్రన్థి : భిధ్యన్తే సర్వసంశయా
క్షీయన్తే సర్వకర్మాణి గురో : కరుణమయా శివే ॥

తా॥ బహుకాలము శ్రీగురుదేవుని సన్నిధానమున నివసించి శుశ్రూష గావించు

చున్నందున గురుని అపార కరుణామయ దృష్టి శిష్యుని మీద ప్రసరించు చున్నది. ఆదయామయ దృష్టికేవలామృతమయము. సర్వసంతాప నాశకము. వర్షము దావానలమును క్షణములో చల్లార్చునట్లు సంసార దావానలము ఉపశమించుచున్నది. అనాదినుండి హృదయమున అజ్ఞానముచే ఏర్పడిన వాసనాగ్రంధినుండి గురుకరుణచే చేధింపబడు చున్నది. సకల సంకల్పములు నశించుచున్నవి. జ్ఞానమను ఖడ్గముచే హృదయ గ్రంధి నాశనమగుచున్నదని భావము. ఈ ప్రకారము జ్ఞానాగ్నిచే హృదయ ములోని పాప వాసనలన్నియు దగ్ధములై జ్ఞాన తేజస్సు ప్రజ్వరిల్లు చున్నది. ప్రజ్ఞాన సూర్యోదయమైనది. సకల కర్మములను కట్టెలు జ్ఞానమను మహాగ్నిలో దగ్ధములైనవి. ఈప్రకారము శ్రీ గురుదేవుని యపారమగు సర్వతేజోమయమగు పరిపూర్ణమగు ఆనంద స్వరూపమగు కరుణా దృష్టిచే హృదయ గ్రంధి విచ్ఛేద కరమైన యెడల సర్వ సంశయ నివృత్తియై సకల కర్మలు ధ్వంసమై అఖండజ్ఞానరూపమై ప్రకాశించు చున్నది.

**వసిష్టుడు శ్రీరామునికి శమము గురించి చెప్పిన విధము.**

యోగవాసిష్టము ( వసిష్ట గీత) 4వ అధ్యాయము.

శమ విచార సంతోష సదాచార నిరూపణము.

వశిష్ట ఉవాచ:

1. శ్లో॥ శమేనా సాధ్యతే శ్రేయః శమోహి పరమం పదమ్
శమః శివః శమః శాన్తిః శమోభ్రాన్తి నివారణమ్

తా॥ శ్రీ వసిష్టుడు : ఓరామచంద్రా! శమము ( ఇంద్రియ జయము మనశ్శాంతి) చేతనే శ్రేయముకలుగును; శమమే పరమాత్మపదము. శమమే శివుడు, శమమే శాంతి, శమమే భ్రాంతి నివారణము.

2. శ్లో॥ పుంసః ప్రశమతృప్తస్య శీతలాచ్ఛతరాత్మనః
శమభూషిత చిత్తస్య శత్రు ర్యేతి మిత్రతామ్ ॥

తా॥ శమముచే పరితృప్తుడును, రాగద్వేషాది తాపవర్జితమై నిర్మలమైనట్టి హృదయము కలవాడును శమాలంకృత చిత్తుడునగు మనుజునకు శత్రువున్ను మిత్రుడగుచున్నాడు.

**11.** శ్లో॥ న పిశాచా న రక్షాంసి న దైత్యా న శత్రవః
న చ వ్యాఘ్రభుజఙ్గా వా ద్విషన్తి శమ శాలినమ్ ।

తా॥ శమము (మనశ్శాంతి)చే శోభించు మనుజుని యెడల పిశాచములుకాని, రాక్షసులుకాని, దైత్యులుకాని, శత్రువులుకాని, పులి, సర్పము మొదలగు క్రూర జంతువులుకాని ద్వేషము కలిగియుండవు.

**12.** శ్లో॥ సుసంసద్ధసమస్తాఙ్గం ప్రశమామృతవర్మణా
వేధయన్తి న దుఃఖాని శరా వజ్రశిలామివ.

తా॥ బాణములు వజ్రశిలను భేదింపజాలనట్లు ఉత్తమ శమరూప కవచముచే బాగుగ కప్పబడిన అవయవములు గలవానిని దుఃఖము లెవ్వియును పీడింపజాలవు.

**20.** శ్లో॥ తపస్విషు బహు జ్ఞేషు యాజకేషు నృపేషు చ
బలవత్సు గుణాఢ్యేషు శమవానేవ రాజతే.

తా॥ తపస్వులందును, పండితులందును, యజ్ఞమొనర్చువారియందును, రాజులందును, బలవంతులందును, గుణశీలులందును శమవంతుడే (శాంత చిత్తుడే) శ్రేష్ఠుడై విరాజిల్లును.

**21.** శ్లో॥ శమ మమృత మహార్య మార్య గుప్తం
పరమవలమ్బ్య పరం పదం ప్రయాతాః
రఘు తనయ యధా మహాను భావాః
క్రమమను పాలయ సిద్ధయే త మేవ

తా॥ ఓ శ్రీ రామచంద్రా! శమము (చిత్తశాంతి) అను అమృతము ఇతరులచే అపహరింపబడుటకు శక్యముకానిది. ఉత్తములగు మనుజు లిద్దానిని బహుజాగ్రత్తగా రక్షించుకొనిరి. మహానుభావులగు వారీ శమమను ఉత్కృష్ట సాధనమునే ఆశ్రయించి పరమాత్మ పదమును బొందిరి కాబట్టి మోక్షసిద్ధి కొరకై నీవున్నూ అదియే క్రమమును అవలంభింపుము.

**దమము:** బాహ్యేంద్రియ నిగ్రహము అనగా కన్ను, ముక్కు, చెవులు, చర్మము, నాలుక, మొ॥ పంచ జ్ఞానేంద్రియములు చేతులు, కాళ్ళు, నోరు అను పంచ కర్మేంద్రియములు మొత్తము పది ఇంద్రియములు వాటి వాటి

విషయంవుల మీద కు వంనసులాగుకొని పోకుండా నిగ్రహించుంట దమమనబడును. ఇటువంటి బాహ్యేంద్రియ నిగ్రహమువలన మనస్సు సంకల్ప వికల్పములయిన యితర విషయముల మీదకు పోకుండాచేయును.

శబ్దస్పర్శరూప రస గంధవములు లేని నీయదార్ధము (ఆత్మ) కు చైతన్యముతో కూడిననేను అనెడి సంసారభ్రాంతిలేదు భార్యా బిడ్డలతో నున్నదే సంసారము కాదు. సంసారము అనగా చైతన్యముతో కూడిన అహంకారమనే నేను. ఈనేనే సంసారము ఇదే భార్యాబిడ్డలు ఇదే ధన ధాన్యములు ఇదే బంధుమిత్రులు, ఇక వేయి చెప్పనేల నీవు చూస్తున్న సర్వ ప్రపంచము నేనే. ఇదే అహంకారము. ఇదే అవిద్య తాను ఉంటే అన్నీవున్నవి. తాను లేకపోతే ఏదీలేదు. ఈచైతన్యమే అన్ని తిప్పలుపడుచున్నది. దీనిని శ్రద్ధగా గమనింపుడు. ఈచైతన్యము నీవు కావు. నీవు ఒకప్పుడూ వుండుట లేకుండుట అను రెండూ లేని వాడవు.

నిన్ను నీవెరుగుట యెరుగక పోవుట అను భావాభావరహితుడవు చైతన్యమే నీవైతే నేను అనెడి అహంకారముతో ఒకప్పుడు వున్నట్లు ఉండి సద్గురు కటాక్షమున మేల్కొంటే తుదకులేనిది లేనిదగుచున్నది. మూలములేని యీగుర్తెరిగే శరీరము చేతనే శరీరమునకు పేరుపెట్టుకొనియున్నావు. కనుక అదే నీవు అనుకుంటున్నావు. గురుకరుణచే యదార్ధము గ్రహించి చావుపుట్టుకలు లేక రాకడ పోకడ లేక సర్వకాలము ఒకటి గాక రెండుగాక నీకు నీవే స్వతసిద్ధమైయున్నావు.

నీవు సకల దేశములయందును సమస్త వస్తువుల యందును సమస్త జీవుల యందును లోపల వెలుపల నిండి మాయాతీతుడవైయుండి, పైసకలేంద్రియ వ్యాపారములు నీవిగా భావించుట తగునా నీవిగా భావించుటకు నీవెక్కడ వున్నావు? ఈమూలములేని గుర్తెరిగే తెలివిని ఉపదేశ కాలమందు నిజ గురుస్వాములవారికి గురుకట్నముగా ఇచ్చి అట్టి గుర్తెరిగే తెలివిని అనగా తనుధనమాన ప్రాణములను తిరిగి దొంగిలించనని ఘోరప్రమాణము చేసియున్నావు. అందుచేత తాను లేని విచారణ యందుండుటయే నీ విధి. అందుచేత ఆవిధముగా ఇరువది యైదవ యింద్రియమైన ఆత్మను దానితో బాహ్యేంద్రియములను నిగ్రహించుటయే దమమనబడును.

**ఉపరతి :** ఈవయూలవములేని గుర్తెరిగే శరీర సంబంధమయిన పాప పుణ్యఫలాసక్తిని వర్జించి కర్తృత్వము వీడి త్రివిధ వాసనారహితుడవై సమస్తము గురుస్వరూపముగా భావించుచుండుట అనగా విహితమైనటువంటి కర్మలను విద్యుక్తముగా విడుచుట. దీనినే సన్యాసమని చెప్పుదురు. అనగా విహితమైనటువంటి కర్మలను కర్తృత్వాభిమాన రహితుడవై ఫలములను అపేక్షింప కచేయుట. అప్పుడు నీకు దైవ భ్రాంతి లేదు. నీవు శబ్దస్పర్శ రూప రస గంధము లేని సచ్చిదానంద రహితుడవై యున్నావు. ఈస్థితికి జనన మరణములు లేవు. గనుక నీవు ఇది వరలో పుట్టలేదు. చచ్చిపుట్టబోవు. అనగా నీకు జనన మరణములు లేవు. (శరీరము నీవుకావు అనే దృఢముండవలెను) తాడును చూచి పాము అనుకున్నట్లు ఈజగత్తును చూచిఉన్నదనే జ్ఞానా జ్ఞానములు నీకు లేవు. ఇప్పుడు నీయదార్థమయిన స్థితి (నేను) నీకు గురువు అనిగాని నీవు శిష్యుడవని గాని దైవాతీతుడవనిగాని యేమాత్రము గుర్తున్న ను చచ్చిపుట్టవలసినదే.

తానులేని విచారణ తెలియని గురువులు గురువులమనిపించుకొనుచు శిష్యులను ప్రోగుచేసుకుంటూ జీవిస్తారు. వారిద్వారా ధనమును సంపాదించు కొందురు. అందుకే వారి పూర్వపుణ్యము పనికి వచ్చును. కాని ఈమూలము లేని గుర్తెరుగు శరీరము అనే భవరోగమును తానుకుదుర్చుకొనలేడు. తన శిష్యులకు కుదర్చలేడు.

గురూపదేశమైన తర్వాత గుర్తెరుగు శరీరమైయున్నా (కర్తృత్వముతో వున్నా) నరకమే గురూపదేశము పొందకున్నా నరకమే. అనగా జనన మరణ రహితుడవు కావు. నీవు జనులకు మార్గదర్శకుడవు. మంచి ఆచరణ గలవాడవై యున్నప్పటికిని పాపపుణ్య వాసనచే నిన్ను గుర్తెరుగు శరీరము నీకు వున్నది లేనిది అనుకర్తృత్వము లేకుండా వుండుటయే ఉపరతి అందురు. కర్మలు అనగా పుణ్యము సంపాదించుటకు చేయు ధర్మములు మోక్షమునకు విరోధము. కనుక నిరంతరము ఆత్మస్వరూపమగు విచారము చేయుటకు అన్ని ధర్మములను విడుచుటయే ఉపరతి . కర్మలు మోక్షమునకు విరోధము. అనగా మోక్షసాధనము కొరకు కావలసిన జ్ఞానమునకు విరోధము కనుక నిరంతరము సద్గురుడు ఉపదేశకాలమున నుడివినట్లు ఆత్మస్వరూప విచారము చేయుటకు అన్ని కర్మలు విడుచుటయే ఉపరతి.

**ఉదాహరణమునకు భగవద్గీత 18వ అధ్యాయము మోక్షసన్యాసము.**

66. శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

తా॥ సమస్త ధర్మములను విడిచిపెట్టుము నన్నొక్కనిని (సద్గురుని) మాత్రము శరణు బొందుము నేనే నిన్ను సమస్త పాపములనుండి విముక్తునిగ చేయగలను. శోకింపకుము.

వ్యా॥ సర్వధర్మాన్ పరిత్యజ్య - నిత్యనైమిత్తికాది సమస్త ధర్మముల కంటెను కర్మముల కంటెను సద్గురు నాశ్రయించుట (భగవచ్ఛరణాగతి) మోక్షమునే అనగా జన్మరాహిత్యమునే కలగజేయును. అయాధర్మములన్నిటి యొక్కయు, కర్మములన్నిటి యొక్కయు ఫలితములు శరణాగతియొక్క ఫలితముననే ఇమిడియున్నవి. మామేకం అనిచెప్పుట వలన సద్గురునొక్కరిని ఆశ్రయించిన చాలును. సమస్త కర్మ ధర్మములను ఆశ్రయించినట్లే అగునని తెలియుచున్నది. చెట్టుమూలమును తడిపినచో శాఖాపత్రాదులన్నిటినీ తడిపినట్లేయగును గదా! పైగా అనేక మార్గములు కర్మములు ధర్మములు గజిబిజిగా నుండి మనస్సునకు చంచలము కూడా కలుగజేయును. కాబట్టి ఒక సద్గురునే ఆశ్రయించిన శ్రేయస్కరము అదొక్కటియేది? దేనిని తెలిసికొనినచో సమస్తము తెలియునో దేనిని పొందినచో సమస్తము పొందునో అట్టి తన యదార్థ స్థితిని (ఆత్మవస్తువును) బ్రహ్మవస్తువును పొందుటకు సద్గురుని ఆశ్రయించిన చాలును ఇతర గొడవలతో ఇతర సాధనలతో ఇతర ధర్మములతో ఇతర కర్మలతో పనిలేదు. కావుననే వానినన్నింటిని వదలి తననొక్కనినే శరణు బొందుము అని భగవాను డుపదేశించెను.

అహంత్వా సర్వపాపేభ్యో మోక్షాయిష్యామి అట్లు నన్నాశ్రయించినచో మీయొక్క సమస్త పాపముల నుండియు విడుదల పొందించెదనని హామీయిచ్చిరి. అనగా సంపూర్ణముగా బంధ విముక్తునిగా చేసెదనని చెప్పిరి. అందుచేత సమస్త ధర్మములు విడిచిపెట్టి ఒక్కసద్గురుని ఆశ్రయించుటయే ఉపరతి అందురు.

**తితిక్ష :** జనులు పూర్వవాసనచే తన్నుతాను జూచితినని భావించుచు యిరువది నాలుగు ఇంద్రియవముల యొక్క సంకల్ప వికల్ప చంచల కర్తృత్వము

తన్నెంతమాత్రము అంటుకొనవనుచు తనకు పాపపుణ్యములు లేవనుకొను చు హింసమొదలైన దుష్ప్రవర్తనతో ప్రవర్తించుచు గుర్తు నశించనందున మరల మరల చచ్చి పుట్టుచుందురు.

పరమ గురుని ఉపదేశ బలముచే హృదయ గ్రంధి వీడి కర్తృత్వ రహితుడై యీ మూలములేని గుర్తెరిగే శరీరమును విడిపించుకొనవలెను. పూర్వవాసనా బంధములైన సుఖములకు సంతోషించక గర్వపడక ఎటువంటి గొప్ప కష్టములు వచ్చినను ముఖమునైనను చిట్లించక అంతయు మూలము లేని గుర్తెరిగే శరీరమునకే ( దాని ప్రారబ్ధవశమున దానికి వచ్చినది) గనుక చైతన్యాతీతుడవై యున్న నీవు యెరుగుట యెరుగక పోవుట అను భావాభావరహితుడవైయుం డుటయే " తితిక్ష " అనబడును.

**ఉదాహరణ భగవద్గీత 5వ అధ్యాయము కర్మసన్యాసము.**

**20.** శ్లో॥ న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥

తా॥ స్థిరమగు బుద్ధి గలవాడును మోహరహితుడును. బ్రహ్మమందు నిలకడగలవాడును. నగు బ్రహ్మజ్ఞాని ఇష్టమైనదానిని పొందినపుడు సంతోషముగాని అయిష్టమైనదానిని పొందినప్పుడు దుఃఖమునుగాని పొందకుండును.

**అట్లే భగవద్గీత 14వ అధ్యాయము గుణత్రయ విభాగయోగము.**

**25.** శ్లో॥ మానావమాన యోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారమ్భ పరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే ॥

తా॥ మానావమానములయందు : మిత్ర శత్రువులయందును కష్టసుఖముల యందును యెవరు సమానముగానుందురో ఎవరు సకల విధములగు ఆరంభములను విడిచిపెట్టుదురో అతడే గుణాతీతుడు అదియే తితీక్ష.

**శ్రద్ధ :** శ్రద్ధ అనగా గురువాక్యనిష్ట. నిజగురుని బోధయందే దృఢ నమ్మిక నిశ్చయముగలవాడై సాంగత్యమొందక పైకి మాత్రము లోకులతోనున్నట్లు ఉంటూ నిజగురునివాక్యమునే సర్వకాల సర్వావస్థలయందును మననము చేయుచూ స్వదృష్టియందుండి భ్రాంతిరహిత సంబంధమయిన బోధనలనే

వినుచు అట్టి గ్రంధములనే జూచుచు అట్టి పాటలనే పాడుచు అట్టిమాటలనే వినుచు అట్టి గురువులనే సందర్శించుచు భ్రాంతులతో అంతగా స్నేహమొందక తాను లేని విచారణ నిద్రవచ్చినదాక చచ్చినదాక మరువకుండుటయే శ్రద్ధయనబడును. **ఉదా: భగవద్గీత 9వ అధ్యాయము రాజవిద్యా రాజ గుహ్యాయోగము.**

**3.** శ్లో॥ అశ్రద్ద దానాఃపురుషా ధర్మస్యాస్య పరన్తప
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యు సంసారవర్త్మని.

**తా॥** అర్జునా! ఈ (అత్మజ్ఞానమను) ధర్మమునందు శ్రద్ధలేనట్టి మనుజులు నన్ను పొందనివారై తన్నుతాను తెలుసుకొననివారై మృత్యురూపమైన జనన మరణ సంసార మార్గమునందే చిక్కుబడుచున్నారు.

లౌకిక రంగమునగాని, పరమార్ధరంగమునగాని, ప్రతికార్యమునందును శ్రద్ధ చాల అవసరము. ఒకనికి ఒకవస్తువునందు గాని, ఒకకార్యమునందు గాని, ఎంతెంత శ్రద్ధయుండునో అంతంత చక్కగా వస్తువు ఫలించుచుండును. ఆ కార్యము నెరవేరుచుండును. కాబట్టి విజ్ఞులగువారు శ్రద్ధయనే యీసుగుణ మును చేబట్టి దుఃఖ ప్రదమగు యీ సంసారమార్గమున బడకుండా ఆనంద ప్రదమగు తన్నుతాను తెలుసుకొను బ్రహ్మావిద్యను చక్కగా అనుష్టించి తరించవలెను. దీనినే శ్రద్ద యనబడును.

**సమాధానము :** అనగా నిజ గురుడు బోధించువాక్యము నిజశాస్త్రమునకును తానులేనివారు వ్రాసిన గ్రంధములకును. నీహృదయ మునకును సరిపోయి యుండవలయును. అంతట స్వశరీరుల వాక్యములు నీకు కలనైన వినిపించక మూలము లేని గుర్తెరుగు శరీరము లేని వాడవై అనగా కర్తృత్వ రహితుడవై హృదయ గ్రంధి వీడి యెటుజూచినా, నీ స్వరూపమేయై, మరల మరల సంశయించ కుండుట. ఇదియే సమాధానము.

ఇందు మూలములేని గుర్తెరిగే శరీరమనగా జీవసృష్టి అంతయు పంచభూత సమ్మేళనము వల్లనే జరుగుచున్నది. ఈపంచభూతములకు మూలములేదు. మూలము లేని దానివలన కలిగిన శరీరములకు మూలములేదు. అటువంటి శరీరము కర్తృత్వముతో నేను నేను అని గుర్తు కలిగి యున్నది. గురుదేవుని వలన అభ్యసించే బ్రహ్మావిద్య కొరకు కర్తృత్వమనే తను ధనమాన ప్రాణముల

ను అనగా ఈమూలములేని గుర్తెరిగే శరీరమును గురుదేవులకు గురుకట్నముగా అర్పించినందున అదియేమీ లేదని గ్రహించవలెను.

**ముముక్షత్వము :** అనగా మోక్షమందు కోరిక. మోక్షమనగా బంధవిముక్తి అనగా ఆగామి సంచిత ప్రారబ్ధములనే మూడును పూర్వజన్మకర్మఫలములు. వాటి ననుసరించి. మానవజన్మ కలిగినది. ఈజన్మలో ప్రారబ్ధకర్మఫలముల నుభవిస్తూ మరల అహంకారముతో ఈజన్మలో మరణించువరకు చేయుకర్మలు (పాపపుణ్యములు) సంచితములో భద్రపరచబడి ఆగామి అను ముందు జరగబోయే జన్మలో అనుభవింతురు. ఆజన్మలో అది ప్రారబ్ధ కర్మఫలముగు ను. ఈ విధముగా అహంకారము వలన జన్మలు పెరుగుచు సూక్ష్మశరీరము బంధింపబడియుండుటే బంధము. ఆవిధముగా అనేక జన్మలతో నానా రకముల శరీరములతో పుడుతూ చస్తూ కాల చక్రమున బంధింపబడి జీవుడు ఉంటున్నాడు. సజ్జనుల సాంగత్యము వలన సద్గురువు నాశ్రయించి ఆయన బోధయందు తైలధారవంటి నమ్మకముతో వారికి చతుర్విధ సేవలు కర్తృత్వ రహితులై దేహాభిమానమును వదిలి చేసిన యెడల వాసనాత్రయము నశించి హృదయగ్రంధి వీడును. అదే కర్తృత్వరహితము. దాని వలన జననమరణ రహితమైన స్థితి కలుగును అదే జన్మరాహిత్యము. అదే బంధవిముక్తి అటువంటి ప్రయత్నమే ముముక్షత్వము.

అటువంటి బంధవిముక్తిని పొందుటకు తీవ్రమోక్షేచ్ఛ అవసరమని పెద్దలు చెప్పుదురు. జీవితము అశాశ్వితము. ఈశరీరము ఏక్షణమునరాలిపోవునో తెలియదు. కనుక జీవించి ఉండగనే అతి త్వరలో బ్రహ్మవిద్యను పరమ గురుని చేరి సాధించవలెను. సంసారమందు ఆధ్యాత్మిక అదిభౌతిక అదిదైవికమను తాపత్రయములనెడి అగ్నిచేత దహింపబడుచున్న పురుషుడు ఈసంసార తాపము నెవరు పోగొట్టుదురో అటువంటి సద్గురువులు ఎక్కడ గలరో దీనికి సాధనము లేమిటి అని తలంచు చుండే వాని చిత్త ప్రవృత్తికే తీవ్ర మోక్షేచ్ఛయని పేరు.

ఈసాధన చతుష్టయ సంపత్తిని బ్రహ్మవిద్యకు ముందుగా ఎందుచేత నభ్యసించ వలెననగా, ఒకక్షేత్రమున సరియైన పంటలు పండించవలెనన్న దానిని యెగుడు దిగుడులను సరిజేసి రాళ్ళురప్పలను తీసి నాలుగు వైపుల నీళ్ళు బైటికి

పోకుండా గట్లుపేసి, బాగుగాదున్ని నీళ్ళుపెట్టి, మరల మరల దున్ని విత్తనములు వేసి ఎరువులు వేసిన యెడల చక్కని ఫలితముతో ఫలసాయము వచ్చును. అట్లే జన్మతోనే మాయా ప్రభావమువలన కలిగిన అజ్ఞానముతో (అవిద్యతో) మూఢాచారముల కలవాటు పడియున్న హృదయక్షేత్రమందు బ్రహ్మా విధ్యాభిలాష కలగదు. అందుచేత బ్రహ్మావిద్యకు సంబంధించిన బ్రహ్మాజ్ఞానమును యెంత బోధించినను మనసుకు పట్టదు అవిద్య తొలగదు. మూఢాచారములు వదల లేరు. కర్తృత్వముపోదు. అట్లే ఒక బట్టకు సరియైన రంగు పట్టించవలెనన్న దానిని ముందుగా ఉతికి మురికిని పోగొట్టిన యెడల దానికి రంగుసరిగా పట్టును. అట్లే హృదయమున గల కర్తృత్వమనే అహంకార మలినమును బ్రహ్మావిద్యాభ్యాసులు ముందుగా సద్గురుని ద్వారా సాధన చతుష్టయ సంపత్తిని తప్పని సరిగా అభ్యసించి తీరవలెను. గురు ముఖముగా త్రికరణశుద్ధిగా తీవ్రవెరాక్షేచ్ఛతో అభ్యసించిన యెడల బ్రహ్మావిద్యకు యేశ్రమయు అక్కరలేదు. అభ్యాసమంతా ఈ నాలుగు సాధనలతోనే ఉన్నదని గ్రహించవలెను.

మరియు నాలుగు సేవలతో గురువును సంతోష పరచినట్టి శిష్యునిమెచ్చి తీర్థప్రసాదములిచ్చి త్రివిధ దీక్షలొసగి హస్తమస్తక సంయోగము గావించి తారకమంత్రోపదేశము ఒసంగును. శిష్యుడు గురునికి తనుధనమాన ప్రాణములు త్రికరణ శుద్ధిగా అర్పించి, సాష్టాంగ నమస్కారములు చేయవలయును. ఆవిధముగా సాధనచతుష్టయ సంపత్తిని అభ్యసించని యెడల యెంతటి పూర్వజన్మసుకృతము గలవాడైనను బ్రహ్మావిద్యను సాధించలేడు.



# అహంకారము -మమకారము

**నేను అనగా అహంకారము -నాది అనగా మమకారము**

ఈరెండూ కలిస్తె కర్తృత్వము దీనిని వదిలితే జన్మరాహిత్యము. అనగా మరణించే వరకు శరీరమందుగల జీవి (సూక్షశరీరము) తిరిగి జన్మించదు. ఇదే బ్రహ్మవిద్యారహస్యము.

సమస్త జీవులు పుట్టుకతోనే మాయచేత ఆవరింపబడినందువలన అహంకార మమకారములు కలిగినవి. దానితోనే రాగద్వేషములు మొదలైనవి కలిగినవి. అదియే అజ్ఞానమునకు మూలకారణము దీనినే అవిద్య అందురు.

ఎంతటి అవతారపురుషులైనా శ్రీరామచంద్రుడు త్రేతాయుగములో 16వ యేటను, శ్రీకృష్ణుడు అష్టభార్యలను పెండ్లియాడిన తర్వాత (ద్వాపర యుగములో) బ్రహ్మవిద్యను నేర్చుకొనియుండిరి. యీ బ్రహ్మవిద్యను శ్రీరాముడు వశిష్టునివల్ల 20రోజులు ఆలకించి, నేర్చుకున్న బ్రహ్మవిద్యను వాల్మికి యోగవాసిష్టమను గ్రంథముగా వ్రాసినాడు. శ్రీకృష్ణుడు సాందీపుని వల్ల నేర్చుకున్న బ్రహ్మవిద్యను కురుక్షేత్ర యుద్ధసమయమున అర్జునునికి చెప్పినదానిని వ్యాసుడు భగవద్గీతగా వ్రాసినాడు. అనగా శ్రీరాముడు శ్రీకృష్ణుడు బ్రహ్మవిద్యను నేర్చుకొనని యెడల యోగవాసిష్టము, భగవద్గీత అనే గ్రంధములు లోకానికి సంభవించవు. అని గ్రహించవలెను. అవిద్య ఎట్లు కలుగుననగా

**ఉదా:- భగవద్గీత 7వ అధ్యాయము విజ్ఞానయోగము.**

**27.** శ్లో॥ ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వన్ద్వమోహేన భారత
సర్వభూతాని సమ్మోహం సర్గేయాన్తి పరంతపః

తా॥ సమస్తప్రాణులు పుట్టుకతోనే రాగద్వేషాదులు కలుగుటచేతనే జ్ఞానము కప్పబడి అజ్ఞానమును చెందుచున్నవి. ఆకారణముచేతనే మానవులు కోర్కెలచేత బంధింపబడి సుఖదుఃఖములలో మునిగి నావంక (గురుని కొరకు) చూడకుండిరి.

కనుక జన్మతోనే సంభవించిన అహంకార మమకారములను వదలిపెట్టుట యెవరి తరము. పుట్టుకతోనే సంభవించిన అజ్ఞానమువలన యెంతటి వారైనా ఎంతటి శాస్త్రజ్ఞానము కలవారైనా తమకు అహంకార మమకారములున్నట్లు తమంతతాము గ్రహించలేరు. అవిద్యను తొలిగించు కొనుటకు బ్రహ్మావిద్యనే అవలంభించవలెను. ఎంతటి మహామహులకైనా అహంకారమమకారములను తొలగించుకొను ప్రయత్నముండదు. సద్గురువుల సాంగత్యము కలిగినప్పు డు ఈఅహంకార మమకారముల స్థితి అర్థమై వాటిని వదిలించుకొనవలెనను జ్ఞానముకలుగును అదే సజ్జనసాంగత్య ఫలితము.

అహంకారమమకారములను వదిలించుకొనుట బ్రహ్మాజ్ఞానముగల రాజయోగీంద్రుల వలననే సాధ్యము.

అన్ని మతములలోను చెప్పబడిన దేవుళ్ళతో సహా మూడుకోట్ల దేవతలలో ఏదేవునికి అహంకారమమకారములను వదిలించుశక్తిలేదు. మరియు ఆదేవతలకు కూడా అహంకారమమకారములుగలవు. అహంకార నిర్మూలనకు పరమగురుడే శరణ్యము ఒక్క పరమగురునకు మాత్రమే అహంకార మమకారములుండవు.

**ఉదా:- గురుగీత**

176. శ్లో॥ చార్వాక వైష్ణవమతే సుఖం ప్రాబాకరే న హి ।
గురోఃపాదాంతి కేయద్వత్ సుఖం వేదాన్త సమ్మతమ్

తా॥ ఏమతమునందును శాశ్విత సుఖములభించదని నిరూపించుచున్నారు. శ్రీగురుదేవుని యొక్క సన్నిధానమున నిర్గుణ నిర్వికారమగు సకలోపనిషత్ప్రతి పాద్యమగు జనన మరణ రహిత ప్రజ్ఞాన స్వరూపమగు ఆత్మతత్వము తెలియబడు చున్నది. అందుచేత అపరిమిత సుఖము లభించుచున్నది. జీవులు స్వస్వరూప తత్వమును తెలిసికొని పరమశాంతిని పొందుచున్నారు. అట్టి సుఖము చార్వాక మతమును గాని వైష్ణవమతమునుగాని శైవమతమునుగాని, జైనమతమునుగాని, పూర్వ మీమాంసక మతమునుగాని ఆశ్రయించిన లభించదు. అవన్నియు తత్త్వజ్ఞానమును యివ్వలేవు. వేదాంత తత్వమే

పరమసుఖ జ్ఞానస్వరూపము. మరియొక ఉదహరణ *గురుగీత*

**175.** శ్లో॥ నసుఖం వేదశాస్త్రేషు న సుఖం మంత్రయంత్రకే
గురోః ప్రసాదాదన్యత్ర సుఖం నాస్తి మహీతలే ॥

తా॥ సచ్చిదానంద స్వరూపమగు పరబ్రహ్మము యొక్క అనుభవముచే గలిగెడు ఆనందము అనంతమని తెలుపుచున్నారు. వేదములందును శాస్త్రములందును సుఖములేదు మహామంత్రముల యెడను, శ్రీచక్రాదియంత్రముల యందును పరమ సుఖములేదు. అనగా వేదశాస్త్రములను చదివినను, యంత్ర మంత్ర రహస్యముల నెరుంగు విద్యలను బడసినను అవన్నియు తనలోనున్న అవిద్యను బాపి పరమసుఖమును కలుగజేయజాలవు. శ్రీగురుదేవుని యొక్క యనుగ్రహ మాత్రమున అనాది దుఃఖమును నిర్మూలించి శ్రీగురుబ్రహ్మ స్వరూపానుభవమును గలిగించి అపరిమిత సుఖమనుభవింపజేయుచున్నది. ఇట్టి తత్త్వమును యెరింగినప్పుడే వేదశాస్త్రముల యొక్క ప్రయోజనము పూర్తియగుచున్నది. శ్రీగురు స్వరూపమే కేవల సుఖము దానికన్న వేరులేదు.

ఈవిషయము గురించి ఆలోచించండి

అసలు ప్రపంచంలో పుట్టడమేమిటి పుట్టి ఒకరికొకరికి సంబంధములేని కష్టసుఖములనుభవించడమేమిటి. మరల చావడం ఆచావుకు కూడా ఒకరికొకరికి సంబంధములేని వయోభేదమెందుకు? యీవిధముగా తప్పని సరిగా జననమరణ స్థితిప్రతివారికి ఉంటుది.

**ఉదా: భగవద్గీత 2వ అధ్యాయము సాంఖ్యయోగము.**

**27.** శ్లో॥ జాతస్య హి ధృవో మృత్యుర్ధ్రువం జన్మమృతస్య చ
తస్మాద పరిహార్యే ఽర్థే న త్వం శోచితు మర్హసి ॥

తా॥ పుట్టిన వానికి చావుతప్పదు, చచ్చినవానికి పుట్టుకయు తప్పదు. తప్పనిసరియుగు ఆవిషయమన శోకించుట యుక్తముగాదు.

కాని ఒకవ్యక్తి అనుభవించు కష్టసుఖములు అందరికి అదే విధముగా ఎందుకుండవు అందురూ పుట్టిన తర్వాత ఒక నిర్ధిష్టమయిన కాలము వరకు వుండి ఎందుకు మరణించరు. ఒకడు గర్భంలోనే మరిణిస్తాడు. ఒకడు పుట్టిన

కొన్ని నిమిషములుండి మరణిస్తాడు. మరి యొకడు కొన్ని గంటలుండి మరణిస్తాడు. కొందరు కొన్ని నెలలలో మరణిస్తారు. కొందరు ఒక సంవత్సరములో మరణిస్తారు. కొందరు చాలాకాలము జీవిస్తారు. అయిన ప్పటికి ప్రతి వారికి జీవితకాలవ్యవధి ప్రత్యేక ప్రత్యేకముగానే వుంటుంది. అట్లే ప్రతివారి స్థితిగతులు కూడా ఒకే రీతిగా వుండవు. ఇలా ఎందుకు జరుగుతుంది. ఈమార్పులెందుకు.

దేవునికి సామాన్య మానవునివలె జీవులపై కక్షలు కార్పణ్యములు గలవా? ఇదంతా దేవుడే చేస్తున్నాడా ఇది మానవుల భ్రమ, దీనినే అవిద్య అంటారు బ్రహ్మజ్ఞానులు.

ప్రపంచమంతా మాయ చేత ఆవరింపబడియున్నది. కనుక ప్రతివ్యక్తికి అహంకారమమకారములు పుట్టుకతోనే సంభవించుచున్నవి. అదేకర్తృత్వము అదే అవిద్య దానివలన చేసిన పాపపుణ్యములు వారికి సంభవించుచున్నవి. ఆకర్మఫలితము వల్లనే ఒక్కొక్కరికి సత్త్వరజః స్తమోగుణములు పత్యేక ప్రత్యేక నిష్పత్తులలో కలుగుచున్నవి. అందుచేతనే మానవులు కోట్లకొలది ఉన్నప్పటికి ఒక్కొక్కరి మనస్తత్వము ఒక్కొక్క విధముగా వుంటున్నది. అందుచేతనే ప్రతివారికి సుఖదుఃఖములు ఆరోగ్యము ఆయుషు మరణకాలము పేరుపేరుగా వుంటున్నది.

ప్రపంచములోని మహాభక్తులు, మేధావులు అనేక విధములైన శాస్త్రవేత్తలు గొప్పగొప్ప మహాపండితులు రాజ్యాలనేలే రాజులు రారాజులు చక్రవర్తులు ప్రస్తుత ప్రజారాజ్యములోని అధ్యక్షులు ప్రధానమంత్రులు మంత్రులు మొదలైనవారు గలరు. వారిలో యెవరైననుగాని సద్గురునిచేరి బ్రహ్మవిద్యను నేర్వని వారెల్లరు అవిద్య గలవారే పైనచెప్పినవారు వారివారి విద్యలలో అగ్రగణ్యులే అయినప్పటికి వారిజీవితములో సుఖదుఃఖములు ప్రాప్తించినప్పుడు ఎంతటి ధైర్య సాహసాలు గల వ్యక్తి అయినప్పటికి అకస్మాత్తుగా ఒక దుర్వార్త అనగా తన ఆప్తులు గాని అతి సన్నిహితులుగాని ఎవరైనను ( ఇంటనున్నవారైనను) చనిపోయినారనిగాని, తను సంపాదించిన ఆస్తినష్టము వచ్చినట్లుగాని వార్త విన్నవెంటనే బలము , వుత్సాహము, ధైర్యము లు సన్నగిలి దుఃఖమునకు లోనై కృంగి కృషించి పోవుదురనుటలో ఆశ్చర్యము లేదు. దీనినే అవిద్య అందురు.

ఆకారణము చేతనే పైన చెప్పబడిన వారిలో ఎవరైనా ప్రస్తుత తాంత్రిక బాబాల వద్దకు జేరివారి భవిష్యత్తు అద్భుతముగా ఉండవలెననే కోరికతో భజనలు పాదపూజలు చేస్తున్నారు. అటువంటి బాబాలు పాదపూజకు కూడా రేట్లు నిర్ణయించుకున్నారు.

మరియు అకస్మాత్తుగా కొంత ధనము కలసివచ్చినపుడు గాని వేరే ఏదైనా శుభమువారికి జరిగినప్పుడు అంతులేని ఆనందమును పొందెదరు. కాని వీరికి శాశ్వితధైర్యము, ఆనందము, శాంతి ఉండదు.

ప్రతివారికి కోర్కెలుండును. వాటికొరకు వారి యిష్టదైవమును మ్రొక్కి ప్రార్థించెదరు. ఆమ్రొక్కులు తీర్చుకొనుటకు ప్రయత్నము చేయుదురు. అపుడా కోర్కెలు తీరవచ్చు తీరకపోవచ్చును మ్రొక్కులు మ్రొక్కినా మొక్కకపోయినా ప్రతివారికి వారివారి పూర్వజన్మ కర్మఫలము ననుసరించియే జరగవలసినది జరిగి తీరుతుంది. ఆస్తికులకైనా నాస్తికులకైనా అదిమాత్రము తప్పదు. వారి అజ్ఞానము వలన నిదానించలేరు. మొక్కకుండా వుండలేరు ఈవిషయం 'అచల సాదన సోపానము'లో చెప్పబడినది. దీనికి కారణం అహంకార మమకారములే.

**ఉదా: భగవద్గీత 5వ అధ్యాయం కర్మసన్యాసము.**

**14.** శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభు :॥
న కర్మఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥

తా॥ భగవంతుడు ( ఆత్మ) జీవులకు కర్తృత్వమునుగాని , కర్మఫలములనుగాని, కర్మఫలములతోటి సంబంధముగాని కలుగజేయుటలేదు. మరేమంటే ప్రకృతి యే ప్రకృతి సంబంధము వలన కలిగిన జన్మాంతర సంస్కారమే ఆయా కర్తృత్వాదులను కలగజేయుచున్నది .

వ్యాఖ్య :- అనగా సృష్టికర్తయగు పరమేశ్వరుడు జీవరాసులలో దేనికినీ కర్తృత్వాదులను సృష్టించుటలేదు. ప్రకృతి జన్యమగు వారివారి జన్మాంతర సంస్కారము ననుసరించి జనులు ఆయా కర్మలను చేయుచు కర్తృత్వము గలవారై ఆయాకర్మల యొక్క ఫలమును అనుభవించుచున్నారు.

భూమిమీద ఎవరు ఏవిత్తనము నాటుదురో అటువంటి ఫలములనే పొందెదరు. అనగా పూర్వజన్మమునందు ఎవరు చేసిన కర్మలకు వారే

ఫలితమును ప్రారబ్ధమను పూర్వజన్మ కర్మఫలములను వారే అనుభవించు చున్నారు. కాని ఏదేవుడు జీవులకు సుఖదుఃఖములను జనన మరణములను ఇచ్చుటలేదు.

బ్రహ్మజ్ఞానులు సుఖదుఃఖములకు అతీతులు అనగా సుఖములు వచ్చినా దుఃఖములు వచ్చినా యీ రెండింటిని సమానముగా భావించి. అనుభవింతురు. అందుచేత వారికి సుఖమువలన అనందముగాని, గర్వముగాని బాధలవలన దుఃఖముగాని ఉండదు. వారియింట జననమ్మైనా మరణమ్మైనా రెండూ సమానమే వాటికి చలించరు.

**ఉదా: అష్టావక్ర గీత 17వ ప్రకరణము.**

11. శ్లో॥ సర్వత్ర దృశ్యతే స్వస్థః సర్వత్ర విమలాశయః ।
సమస్త వాసనా ముక్తోముక్త స్సర్వత్ర రాజతే ॥

తా॥ ఓ శిష్యా జ్ఞాని యగు జీవన్ముక్తుడు సుఖదుఃఖముల యందు అంతటను స్వస్థచిత్తుడై వుంటున్నాడు. అజ్ఞాని సుఖములు వచ్చినప్పుడు సంతోషమును. కష్టము వచ్చినప్పుడు శోకమును, పొందుచున్నాడు. జ్ఞాని సుఖదుఃఖములను సమానముగా చూచుచు ఆత్మానందములో నిమగ్నుడైయుండును. అజ్ఞాని మిత్రులయందు రాగమును, శత్రువుల యందు ద్వేషమును ప్రకటించును. జ్ఞాని శత్రుమిత్రులను సమానముగా జూచును. విషయ వాసనారహితుడై జీవ న్ముక్తుడై నిరంతరము ఆత్మానందము ననుభవించుచు ఒకే రీతిని వెలుగొందును.

అందుచేత అవిద్య అనే అజ్ఞానమును (అహంకారమమకారములు) తొలగించుకొనవలెను. అనగా సద్గురుని చేరి బ్రహ్మవిద్యనభ్యసించ వలెను. దానిని నేర్వని యెంతటి మహాత్ములకైనను ఎంతటి పూర్వజన్మ సుకృతము గల వారికైనను అజ్ఞానము తొలగదు. ఉదా: శ్రీకృష్ణునికి తన పూర్వజన్మ సుకృతముననుసరించి. యెన్నెన్నో మహిమలు సిద్ధించినవి. వాని ఫలితము గా ఆయన యెన్నెన్నో అద్భుతములు చేసి చూపించడం జరిగినది. దానివలన యశోద మరియు ప్రజలు ఆశ్చర్యపడి ఆనందించినారు. అందుచేత శ్రీకృష్ణుని కృష్ణభగవానుడు కృష్ణ పరమాత్ముడు అని చెప్పుకొనిరి. అటువంటి విషయము లు శ్రీకృష్ణునకు నచ్చలేదు కారణం పరమాత్మ స్వరూపము శబ్ద స్పర్శరూప రసగంధములు లేనిదని చిన్నతనము నందే సాందీప మహర్షి వలన విని యున్నా డు. కాబట్టి తాను శబ్ద స్పర్శరూప రస గంధములు గలవాడు కనుక తానెలా

పరబ్రహ్మస్వరూపుడని ప్రశ్న తనమనసున మొలకెత్తినది. అపుడు తన్నుతాను తెలుసుకొనవలెనని తనకు బ్రహ్మవిద్యయే శరణ్యమని గ్రహించినాడు అపుడు సాందీప మహర్షి వద్దకు వెళ్ళి ఆయనకు సాష్టాంగ నమస్కారముచేసి ప్రార్థించినాడు. ఆయన వద్ద ఉపదేశ దీక్ష తీసుకొని త్రికరణ శుద్ధి గలిగి ఆ పరమగురుని బ్రహ్మవిష్ణు మహేశ్వరుల కంటె అతీతమైన పరబ్రహ్మ స్వరూపునిగా తలచి గురువునకు చతుర్విధ సేవలు చేసి అతి త్వరలో బ్రహ్మవిద్యను గ్రహించినాడు.

కురుక్షేత్ర యుద్ధసమయమున అర్జునునకు అజ్ఞానము తొలగించుటకు ఆబ్రహ్మజ్ఞానమును బోధించినాడు ఆవిద్యను వ్యాసుడు భగవద్గీతగ మహాభారతము నందు వ్రాసినాడు.

చిత్రమేమిటంటే భగవద్గీతలోని శ్లోకములన్నియు వల్లెవేసినా అజ్ఞానము తొలగదు అవిద్యతొలగదు అహంకారము పోదు బ్రహ్మవిద్య అంటుదు. పరమగురుడైన సద్గురుని వల్లనే బ్రహ్మవిద్య సాధ్యపడును.

పరబ్రహ్మస్వరూపుడని ప్రశ్న తనమనసున మొలకెత్తినది. అపుడు తన్నుతాను తెలుసుకొనవలెనని తనకు బ్రహ్మవిద్యయే శరణ్యమని గ్రహించినాడు అపుడు సాందీప మహర్షి వద్దకు వెళ్ళి ఆయనకు సాష్టాంగ నమస్కారముచేసి ప్రార్థించినాడు. ఆయన వద్ద ఉపదేశ దీక్ష తీసుకొని త్రికరణ శుద్ధి గలిగి ఆ పరమగురుని బ్రహ్మవిష్ణు మహేశ్వరుల కంటె అతీతమైన పరబ్రహ్మ స్వరూపునిగా తలచి గురువునకు చతుర్విధ సేవలు చేసి అతి త్వరలో బ్రహ్మవిద్యను గ్రహించినాడు.

కురుక్షేత్ర యుద్ధసమయమున అర్జునునకు అజ్ఞానము తొలగించుటకు ఆబ్రహ్మజ్ఞానమును బోధించినాడు ఆవిద్యను వ్యాసుడు భగవద్గీతగ మహాభారతము నందు వ్రాసినాడు.

చిత్రమేమిటంటే భగవద్గీతలోని శ్లోకములన్నియు వల్లెవేసినా అజ్ఞానము తొలగదు అవిద్యతొలగదు అహంకారము పోదు బ్రహ్మవిద్య అంటుదు. పరమగురుడైన సద్గురుని వల్లనే బ్రహ్మవిద్య సాధ్యపడును.

రణరంగ విద్యా గురువుగా ఉద్యోగము దొరికినది. బాలకౌరవ పాండవులకు విలువిద్య మొదలైన విద్యలను నేర్పుతున్నాడు. ఒకనాడు అర్జునునితో విలువిద్యలో నీకంటే అధికుడెవడూ లేనంత వానినిగా నిన్ను తయారు చేస్తానని ద్రోణాచార్యుడన్నాడు.

ఒకనాడు యేకలవ్యుడు అనే బోయబాలుడు ద్రోణాచార్యుని వద్దకు వచ్చి ఆయనతో తన పూర్వ పరిచయమును గుర్తుజేసి తనకు విలు విద్య నేర్పవలసినదిగా అభ్యర్థించినాడు. అందుకు ద్రోణాచార్యుడంగీ కరించినాడు కాని కురుపాండవులు అభ్యంతరం చెప్పినారు. ఏకలవ్యుడు నిరాశతో ఇంటికి చేరినాడు. అంతటితో నిరాశపడక మట్టితో ద్రోణాచార్యుని ప్రతిమను తయారు చేసుకొని దానినే గురువుగా బావించి ఎడతెగని భక్తితో పూజిస్తూ తనంతటతాను విలు విద్యను అభ్యసిస్తున్నాడు. అతి త్వరలో అఖండుడైనాడు. ఒకనాడు అర్జునుడు తన సోదరులతో అడవికి వెళ్ళగా అక్కడ ఏకలవ్యుని విలు విద్యా విన్యాసము చూచి ఆశ్చర్యపోయినాడు. మరియు "నీగురువు ఎవ్వరని" యేకలవ్యుని అర్జునుడగగా నాగురువు ద్రోణాచార్యులని సగర్వముగా చెప్పినాడు. తరవాత అర్జునుడు గురువును సమీపించి జరిగిన విషయము చెప్పి మాకు తెలియకుండా ఆయేకలవ్యుని నాకంటే విలువిద్యలో గొప్పవానినిగా చేసినారని నిందించినాడు. అది విని ద్రోణాచార్యుడాశ్చర్య పడినాడు.

ఒకనాడు ద్రోణాచార్యుడు ఏకలవ్యుని వద్దకు వెళ్ళినాడు ఆఏకలవ్యుని ఆనందమునకు అవధులులేవు. గురువునకు సకలోపచారములు చేసినాడు. నీగురు వెవ్వరని అతనిని ద్రోణాచార్యుడడిగినాడు. తాను తయారుచేసుకున్న గురుని విగ్రహాన్ని చూపించి యీాయనే నాగురువని చెప్పినాడు. మరియు తాను నేర్చుకున్న విలువిద్యను ఆయన యెదురుగా ప్రదర్శించినాడు. గురుదక్షణగా యేమికావాలో దయచేసి అడగమని వినయ విధేయతలతో ప్రార్థించినాడు. అంతట ద్రోణాచార్యుడు ఆశ్చర్యపోయినాడు. కాని అర్జునునికిచ్చిన మాటను నిలబెట్టు కొనుటకొరకు అవకాశము దొరికిన దను కున్నాడు. వెంటనే నిర్ధాక్షిణ్యముగా నీకుడిచేతి బొటనవ్రేలు నిమ్మని కోరినాడు వెంటనే ఆ ఏకలవ్యుడు భక్త్యావేశముతో తనకుడి చేతి బొటన వ్రేలుని కోసి గురుని పాదాలవద్ద వుంచి పాదాభివందనము చేసినాడు.

ఆతర్వాత అర్జునుడు విలువిద్యలో అగ్రగణ్యుడిని చేసినందుకు గురుదక్షిణగా తనకేమి కావలెనో కోరమని ద్రోణాచార్యుని అడిగినాడు అప్పుడు ద్రోణాచార్యుడు" నాకు దృపదుని పట్టితెచ్చి నాకాళ్ళమీద పడవేయమని" కోరినాడు. అర్జునుడు వెంటనే వెళ్ళి దృపధుని పట్టి తనరథమున కట్టితెచ్చి ద్రోణాచార్యుని పాదములపై పడవేసెను. ఆవిధముగా అర్జునుడు గురుదక్షణ నిచ్చినందుకు ద్రోణాచార్యుడానందించినాడు. ఆవిధముగా అంతకాలానికి దృపధునిపై గల కక్షను ద్రోణాచార్యుడు తీర్చుకున్నాడు. అవిద్య అనగా ఇదే. అహంకారము రాగద్వేషములు ఇదే. దృపదుడు యెన్నో యజ్ఞములుచేసినాడు. ఒకయజ్ఞఫలముగా ద్రౌపది తనకు కుమార్తెగా లభించినది. ద్రోణాచార్యుడు అస్త్ర శస్త్ర విద్యాలలో అగ్రగణ్యుడు ఆయిరువురికి బ్రహ్మజ్ఞానము లేదు. కాబట్టి అజ్ఞానము తొలగలేదు. అనుటలో ఆశ్చర్యములేదు. అదే అవిద్య అంటారు. యెంతటి పండితులైనా ఎన్ని యజ్ఞ యాగములు చేసినా బ్రహ్మజ్ఞానములేని వారికి అవిద్య అనే అజ్ఞానము తొలగదు. కాబట్టి వారికి డంభములు, క్రోధములు, కార్పణ్యములు, యీర్ష్యాసూయలు తొలగవు. అనడానికి ఈ ఉదాహరణ చాలును.

అదే ద్వాపరయుగములో సుధాముడను కుచేలుడు శ్రీకృష్ణుడు బలరాముడు మొదలైనవారు సాందీప మహర్షి ఆశ్రమమున విద్యను నేర్చుకొనిరి. అనగా కుచేలుడు శ్రీకృష్ణుడు చిన్ననాటి స్నేహితులు కొంత వరకు బ్రహ్మజ్ఞానము గలవారు ఎవరు యెంతటి బ్రహ్మజ్ఞానులైనప్పటికి జీవించవున్నంత వరకు యెవరి పూర్వజన్మ కర్మఫలితమును అనగా ప్రారబ్ధకర్మ ఫలమును వారే అనుభవించక తప్పదు. అటువంటి ప్రభావము వలన కుచేలునికి చాలమంది సంతానము కలిగెను. అందుచేత దరిద్రమును అనుభవిస్తూ విధిలేక అడవిలో భార్యాపిల్లలతో కాలముగడుపుతూ ఉన్నాడు. (అప్పటికాలములో దరిద్రులు, రాజ్యమును పోగొట్టుకున్న రాజులు విధిలేక అడవికి చేరి కందమూలాదులతో ఉదరపోషణ చేసుకుంటూ బతికేవారు) ఇపుడా అవకాశములు లేవు కాని యెవరో వీరప్పన్ లాంటివారు సైన్య సన్నాహములతో ప్రభుత్వాలకు కూడా జడవక ఎదురులేని జీవితమును గడుపుతున్నారు.

శ్రీకృష్ణుడు పూర్వజన్మ కర్మఫలము ననుసరించి తనకు మహిమలు సంభవించినవి. అవి తనంతటతాను నేర్చుకున్న గారడీ విద్యలుకావు.

కుయుక్తులతో స్వలాభము కొరకు ప్రదర్శించు విద్యలు కావు. పరులసొమ్మును పరోపకారము అను పేరుతో ధనమును సంపాదించుటకు కాదు. అష్టసిద్ధులు కావు పుట్టినప్పటి నుండి అన్ని మహిమలున్నప్పటికి బ్రహ్మవిద్యలేనిదే అవిద్య అనే అహంకార మమకారములు తొలగవని గ్రహించి తన్నుతాను తెలుసుకొనుటకై అనగా జన్మరాహిత్య మార్గమును తెలుసుకొనుటకై సాందీప మహర్షి వద్దకు వెళ్ళి బ్రహ్మ విద్య నభ్యసించి నాడు. దానికిముందే అష్టభార్యలను వివాహముచేసుకున్నాడు. అష్టైశ్వర్యములతో తులతూగు చున్నాడు.

కుచేలుని భార్య ఒకనాడు భర్తతో ఈవిధముగా ప్రార్థించినది. స్వామీ మనపిల్లలు ఆకలి బాధననుభవిస్తున్నారు. ఆబాధను నేను చూడలేకపోతు న్నాను. మీరు మీచిన్ననాటి స్నేహితుడైన శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళి ఆయనను దర్శించి మన దారిద్ర్యమును తీర్చమని అర్థించడం మంచిదేమోనని సలహా యిచ్చినది. ఆమాటతో కుచేలుడు ద్వారకకు బయలుదేరినాడు కాని అతడు అటువంటి దీనాలాపములను చేయడానికి కాదు . చిన్ననాటి స్నేహితుని యీ విధముగానైనా దర్శించబోతున్నాననే ఆనందముతో ద్వారక చేరినాడు.

ద్వారము వద్ద ద్వారపాలకులు అడ్డుకుని కుచేలుని లోపలకు వెళ్ళనీయలేదు. నేను శ్రీకృష్ణుని చిన్ననాటి స్నేహిడను నన్ను కుచేలుడంటారు నన్ను లోపలికి వెళ్ళనీయండని లేక నేను వచ్చిన వార్తనైనా ఆయనకు అందించమని అర్థించినాడు. కుచేలుని బీదవాలకము చూచి ఇతడు పిచ్చివాడని అతనిని యెగతాళి చేసి నవ్వుకుంటుండగా లోపలినుండి కుచేలుని చూచిన శ్రీకృష్ణుడు గుర్తుపట్టి పరుగు పరుగున వచ్చి కుచేలుని కౌగలించుకున్నాడు. అహా ఎన్నాళ్ళకు నిన్ను చూచానయ్యా అంటూ ఆనందముగా అన్నాడు. ద్వారపాలకులు కృష్ణుని చూచి భయపడి క్షమించమని వేడుకున్నారు.

శ్రీకృష్ణుడు కుచేలుని ఆనందముతో లోపలకు తీసుకువెళ్ళి ఉన్నతాసనమున కూర్చుండబెట్టినాడు. బంగారు పళ్ళెములో కుచేలుని పాదములుంచి భార్యలతో బంగారు పాత్రతో నీళ్ళు పోయించి కుచేలుని పాదములను కడిగినాడు ఆనీటిని తననెత్తిని చల్లుకొని భార్యల తలలపై కూడా చల్లినాడు. ఆతరవాత పన్నీటితో స్నానము చేయించి పట్టు వస్త్రము లిచ్చి కట్టించినాడు ఇరువురు పంచభక్షపరమాన్నములతో విందారగించినారు. ఆవిధమయిన ఆదరణచూపి నందుకు కుచేలుడు ఆనందించినాడు. కాని తాను

వచ్చిన సంగతి శ్రీకృష్ణునకు చెప్పలేదు కృష్ణుని భార్యలకు కూడా పైక్రియల వలన కుచేలునిపై భక్తి మర్యాదలు కలిగినవి.

కుచేలుడు ఇక్కడ వుండగనే అక్కడ అతని పర్ణశాల అతి వైభవమైనటు వంటి భవనముగా మారిపోయినది. ఆయింట ధన కనక వస్తువాహనములు సమకూర్చబడినవి. కుచేలుడు కృష్ణుని వద్ద సెలవుతీసుకుని ఇంటికి చేరగా తన పర్ణశాల కనబడక నిర్ఘాంతపోయి భయాందోళన చెందుతున్నాడు. ఇంతలో తన కుమారు డొకడు పరుగు పరుగున వచ్చి నాన్నగారు ఇదే మనఇల్లు మీరు వెళ్లగానే ఉన్నట్లుండి యీ విధముగా మారిపోయినదని ఇందు అష్టైశ్వర్యములు సమకూర్చబడినవని చెప్పి తండ్రిని ఇంటికి తీసుకొని వెళ్ళినాడు.

తాను అడగకుండానే యింత గొప్ప సహాయము చేసినందుక్కు శ్రీకృష్ణునికి కృతజ్ఞతాభివందనములు చేసి ఆనందించినాడు కుచేలుడు.

ఈవిషయం అందరికి తెలిసినదే అయినను మనము ఇందు వలన తెలుసు కొన వలసినదేమనగా బ్రహ్మవిద్యవలన అవిద్య తొలగిరాగద్వేషములు గౌరవాగౌరవములు మొదలైన ద్వంద్వములు మటుమాయమగును. అనగా అహంకారమమకారములు తొలగి సుఖదుఃఖములకు పుట్టుకకు చావుకు తేడా తెలియని స్థితి యేర్పడును. కుచేలుడు అతి దరిద్రములో వున్నప్పటికి బ్రహ్మ విద్య ప్రభావము వలన అహంకార మమకార రహితమైనందున నేను దరిద్రుడననే భ్రాంతి నశించినది. ఆస్థితి సుఖదుఃఖముల కతీతమైనది. అట్లే శ్రీకృష్ణునకు కూడా నేను ఐశ్వర్యవంతుడనే భ్రాంతి, దేహభ్రాంతి నశించినది. అందుచేతనే వారిద్దరిలో ధృపద ద్రోణాచార్యులవలె ఒకరినొకరికి తారతమ్యము కనబడలేదు.

శ్రీకృష్ణుడు ఒక సందర్భములో " నేను అస్కలిత బ్రహ్మచారినన్నాడు. ఎంతటి మహాత్ములకైనా ఎంతటి పండితులకైనా బ్రహ్మజ్ఞానములేనిదే దీని అంతరార్థము బోధపడదు వివరించి చెప్పినా అపహాస్యముగా తీసుకొందురే గాని దానివునికి తెలియదు.

పై తెలిపిన రెండువుదాహరణములు ( ధృపదుడు - ద్రోణాచార్యుడు, కుచేలుడు- శ్రీకృష్ణుడు) యొక్క స్వభావములు గమనించగా అవిద్య అనగానేమి అవిద్యగల వారెవరో అవిద్య నశించిన బ్రహ్మజ్ఞానులైన వారెవరో

అర్థమవుతుంది. అనగా ధృపదుడు ద్రోణాచార్యుడు యిద్దరు చిన్ననాటి స్నేహితులు వారిరువురికి బ్రహ్మజ్ఞానము లేదు. దృపదుడు యజ్ఞయాగములు చేసిన వాడే ద్రోణాచార్యుడు ధనుర్వేధము మొదలైనవి చదివినవాడే యజ్ఞయాగములు చేసినా వేదములు చదివినా పరమగురువు అనే సద్గురువును చేరక బ్రహ్మవిద్య సేర్వనిచో వారుసామాన్యులతో సమానమే. అందుచేతనే దృపదునకు ద్రోణాచార్యునకు అరిషడ్వర్గములు వదల లేదని తెలిసి కొనవచ్చును.

రెండవది శ్రీకృష్ణుడు కుచేలుడు ఇద్దరు బ్రహ్మజ్ఞానులు కాబట్టి దరిద్రునకు అష్టైశ్వర్యవంతునకు తేడా అనునది కనిపించలేదు. కర్తృత్వ రహితము అనే అహంరహితము వలన అటువంటి స్థితి కలిగినది.

సద్గురుని ద్వారా యెంతటి దుర్మార్గుడైనా సజ్జనుడవడానికి బ్రహ్మజ్ఞానము కలగడానికి అవకాశమున్నది. సజ్జనులలో సజ్జనుని సాంగత్యము కొన్నిఘడియలు దొరికినా దాని ప్రభావము చూపించును. ఉదా: వాల్మీకి పూర్వస్థితి దుర్మార్గపు ప్రవర్తనలో నుండగా నారదుని సాంగత్యము అడవిలో దొరికినది. ఆవెంటనే అతనికి మార్పువచ్చినది. కిరాత వృత్తి నుండి వాల్మీకి మహర్షిగా మారిపోయినాడు. అంతే కాక భవిష్యత్తులో జరగబోయే రామాయణమును సంస్కృతములో రచించగలిగినాడు. హిందూమంత సాంప్రదాయులకు యీ విషయం తెలియనిది కాదు.

**నాచే రచించబడిన పుస్తకములు**

1. సూక్తిమాల
2. అచల సాధన సోపానము
3. మనసులోని మాట (గేయసంపుటి)
4. మేలుకొలుపు
5. పరిపూర్ణ బ్రహ్మవిద్య

**ఈ పుస్తకములు దొరుకు స్థలము**

రాజయోగాశ్రమము , నర్సాపురం - 534 275

పశ్చిమగోదావరి జిల్లా

# త్రిగుణములు

**త్రిగుణములనగా సత్త్వరజః తమోగుణములు** : ఈమూడుగుణముల వల్లనే అహంకార మమకారములు, కర్మఫలితములు గలిగి వాటి వలన వాసనాత్రయము, ఈషణత్రయములు వాటివలన సుఖదుఃఖములు, మానావమానములు, జనన మరణములు మొదలైన ద్వంధ్వములు కలుగుచున్నవి. జనన మరణములు త్రిగుణరహితమువల్లనే అంతరించి జన్మరాహిత్యమగును. ఈకర్మఫలితములు మూడురకములు **1.** ఆగామి, **2.** సంచితము, **3.** ప్రారబ్దములు. ఈత్రిగుణములను సద్గురునికి ఉపదేశకాల మందు అర్పించిన యెడల ఆగామి సంచితములు భస్మీపటలమగును. ప్రారబ్దము మాత్రము శరీరము వున్నంతవరకు అనుభవించ వలసి యుండును. అదియెంతటి పూర్వజన్మ పుణ్యముగలవారైనా అనుభవించవలసినదే. ఆప్రారబ్ధము పూర్తిగా అనుభవించిన వెంటనే శరీరమంతమగును. జన్మరాహిత్యమగును. అనగా తిరిగి జన్మయుండదు.

**ఉదా : భగవద్గీత 14వ అధ్యాయము గుణత్రయ విభాగము.**

**20.** శ్లో॥ గుణానేతా నతీత్య త్రీన్ । దేహీ దేహ సముద్భవాన్
జన్మమృత్యు జరాదు:ఖై ర్విముక్తో ౽ మృతమశ్నుతే ॥

తా॥ జీవుడు దేహోత్పత్తికి కారణ భూతములగు యీ మూడు గణములను దాటి (దాటినచో) చావుపుట్టుక, ముసలితనము, దుఃఖము అను వానిచేత పూర్తిగా విడువబడినవాడై మోక్షమును (జనన మరణరహిత ఆత్మస్థితిని) పొందుచున్నాడు.

వ్యాఖ్య :- "గుణాన్" అని చెప్పినందు వలన రజఃతమోగుణములతో బాటు సత్వగుణమును గూడదాటవలెనని భావము సత్త్వగుణమున్నను అహంకారము చావదు కాని మొదట సత్త్వగుణమును అలవరుచుకొనిన యెడల ముందుగా రజోగుణము తమోగుణము వాటంతట అవే మాయ మగును. దానివలన ఈర్ష్య అసూయలు ద్వేషములు కక్షలు కార్పణ్యములు వాటంతట అవే మాయమగును. బ్రహ్మవిద్య సిద్ధంచిన తర్వాత సత్త్వగుణము కూడ నిర్మాలమై శుద్ధ సత్త్వము మిగులును (శుద్ధ సత్త్వమనగా త్రిగుణములులేని సత్త్వగుణము). దీనిని సద్గురు కటాక్షము లేనిదే ఎవరూ సాధించలేరు. అదే రహస్యము.

గుణములవలన అపకారమేదో అవితొలగినందువలన కలుగు ఉపకారమేదో ఈశ్లోకమునందు తెలుపబడినది. " దేహసము ద్భవాన్ " అనగా దేహములను సృష్టించుటయే త్రిగుణముల వలన కలుగు అపకారము. వానివలన జీవుడు జనన మరణ రూపమగు ఈసంసార చక్రము నుండి తప్పించుకొనజాలడు. ఒకదేహము పోయిన మరియొక దేహము వచ్చుచుండును. ఇట్లు యెన్నో కోట్ల జన్మలు ( శరీరములు) త్రిగుణ రూపమనే బీజమునుడియే ఉద్భవించుచున్నవి. ఆమూలము భస్మమయినగాని జన్మలు సమాప్తముగావు. జన్మకలిగినందువలన నష్టమేమనగా ముసలితనము రోగము, చావు దుఃఖములనే ఆపదలన్నియు శరీరముంటేనే కలుగును. అసలు శరీరమే రాకుండా అనగా జన్మలేకుండా చేసు కొనినట్లయిన యెడల సుఖదుఃఖములు మొదలైన ద్వంద్వములుండవు. అందుచేత సద్గురువును చేరి. త్రిగుణములను వదలి జన్మరాహిత్యమును పొందుటయే ఉత్తమము.

**(ఉదా: భగవద్గీత ౨వ అధ్యాయము.)**

**45.** శ్లో॥ త్రైగుణ్య విషయావేదా! నిస్త్రైగుణ్యో భవార్జున
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్

తా॥ ఓ అర్జునా, వేదములు (అందలిపూర్వభాగమగు కర్మకాండము) త్రిగుణాత్మకములగు (సంసార) విషయములను తెలుపునవిగానున్నవి. నీవు త్రిగుణములను వదలినవాడవును ద్వంధ్వములు లేనివాడవును, యోగక్షేమ ముల దృష్టిలేని వాడవును అత్మజ్ఞానివియు కమ్ము.

వ్యాఖ్య :- " త్రైగుణ్య విషయావేదా" పైశ్లోకములందలి సందర్భమును బట్టి చూచినచో కర్మకాండకు యజ్ఞయాగాదులకు సంబంధించిన వేదభాగము (పూర్వభాగము)ను గుర్చియే యిచట ప్రస్తావించబడినదని స్పష్టమగు చున్నది. వేదము యొక్క ఉత్తరభాగము త్రిగుణాతీతముగు పరబ్రహ్మమును గూర్చియే వచించినది. దృశ్యప్రపంచమంతయు త్రిగుణములతో కూడినది. అది అల్పమైనది. దృక్స్వరూపమగు ఆత్మయొకటియే త్రిగుణాతీతమైనది. అది సర్వోత్తమమైనది. గుణములకు లోబడియున్నవానికే ఈబంధము ఈబాధలు ఈజన్మములు, కర్మములు. గుణములను దాటి ఆత్మయందు స్థితిగలిగియున్న జ్ఞానికి నివియేవియు నుండవు. కనుకనే భగవాను డర్జునుని గుణాతీతుడుగా ఆత్మవంతుడుగ కమ్మని ఆనతిచ్చిరి.

**నిత్యసత్త్వస్థః** ఇచట తెలుపబడిన సత్త్వము త్రిగుణములలోని సత్త్వముగాదు. త్రిగుణములు దాటమని చెప్పి మరల ఒకానొక గుణము నాశ్రయింపుమని ఎన్నటికిని బోధించరు. కావున ఇచట సత్త్వమునకు విశుద్ధ సత్త్వస్థితి లేక ఆత్మస్థితి అని అర్థము చెప్పుకొనుట మంచిది. జ్ఞ చిత్తం సత్త్వముచ్యతే (ఆత్మజ్ఞానియొక్క బ్రహ్మాకారమగు చిత్తము సత్త్వ మనబడును) అని శ్రీ వశిష్ఠమునీంద్రులు తెలిపియున్నారు. నిత్యసత్త్వస్థః అని చెప్పినందువలన యేదియెా ఒకానొకకాలమందు గాక నిరంతరము సత్త్వము నాశ్రయించి ఆత్మస్థితుడై యుండవలెనని భావము.

"నిర్యోగక్షేమ ఆత్మవాన్ "యోగమనగా లేని వస్తువును పొందుట క్షేమమనగా దానిని కాపాడుట ఈరెండునూ లేకుండుమని భగవానుడు తెలిపెను. ఏలననగా ఆత్మయందున్నవానికి సమస్త పదార్థములు పొందబడినట్లేయగును గాన ఇకనాతడు దేనిని వాంచింపవలెను? మూడు గుణములు దాటినప్పుడు మాత్రమే జన్మరాహిత్యము కలుగును. కనుక తీవ్రముముక్షువు తన సద్గురుని ద్వారా పై విషయములను తెలుసుకొనవలెను. ఇటువంటి స్థితిని కలగజేసెడి సద్గురుని యందు ఎటువంటి భక్తిని కలిగి యుండాలి అనగా

**ఉదా:- భగవద్గీత 14 అధ్యాయము.**

**26.** శ్లో॥ మాం చయో ఉవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మాభూయాయ కల్పతే.

తా॥ ఎవడు నన్నే అచంచలమైన భక్తియోగము చేత సేవించుచున్నాడో, అతడీ గుణము లన్నిటిని లెస్సగా దాటివైచి బ్రహ్మముగానగుటకు (జీవన్ముక్తుడగుటకొఱకు) సమర్థుడగుచున్నాడు.

**మరియొక ఉదాహరణ గురుగీత నుండి**

**305.** శ్లో॥ తస్మాత్కై వల్యసిద్ధ్యర్థం గురుమేవభజేత్ప్రియే
గురుంవినా నజానన్తి మూఢా స్తత్పరమంపరమ్

తా॥ గురువులేనిదే ఆత్మజ్ఞానము కలగదు ఆత్మజ్ఞానము లేకుండిన మోక్షము లభించదు కావున శ్రీ గురుదేవుని శరణుపొంది నిరంతరము భజింపవలయును.

ఎటువంటి గొప్పపండితులయినను బ్రహ్మజ్ఞానము లేకుండిన మూఢులనియు అవివేకులనియు పామరులనియు వేదాంత శాస్త్రము చెప్పుచున్నది. పండితులనగా ఆత్మ తత్త్వ జ్ఞానము గలవారేనని అర్థము సామాన్యపండితులే మూఢులనగా పామరుల విషయము చెప్పవలయునా సామాన్య లౌకిక విద్యలకే గురువు అవసరమై యుండగా అత్యంత దురవగాహమగు బ్రహ్మజ్ఞానమందు శ్రీ గురుదేవుని అవసరము లేకుండిన బ్రహ్మజ్ఞాన విద్య పట్టుబడదు. కనుక శ్రీ గురుదేవునిచే జ్ఞానతత్వమును తెలుసుకొని శిష్యులు తరించవలెను. సందేహములేదు.

సద్గురునియందు గల భక్తి సామాన్యమైనది కాదు. గురుసేవా మహిమ అద్భుతము భక్తియనగా సద్గురునకు త్రికరణ శుద్ధిగా తనుధనమాన ప్రాణములను ధారవోయుట ఆవిధముగా త్రిగుణములను దారవోసినట్లగును. అప్పుడు దేహ భ్రాంతి జగద్భ్రాంతి నశించి శబ్దస్పర్శరూప రస గంధములు లేని పరబ్రహ్మస్వరూపుడవగుదువు. అనగా గురువే శిష్యుడు శిష్యుడే గురువు అయి నందువలన జన్మరాహిత్య మగును. ఇదియే బ్రహ్మవిద్యా సారాంశము.

# అరిషడ్వర్గములు -నిర్మూలన

అరిషడ్వర్గములు అనగా 1. కామ, 2. క్రోధ, 3. మోహ, 4. లోభ, 5. మద, 6. మాత్సర్యములను యీ ఆరును అరిషడ్వర్గములని పెద్దలు చెప్పుదురు. అనగా మానవులకు యీ ఆరును శతృవులు "అరి " అనగా శతృవు. అనగా మానవునకు తనలోనే ఆరు శతృవులున్నారు. ఇవన్నీ ప్రతిమనుజునిలోను ఉండును. కారణం అహంకారము. అహంకారములేని మనుజుడులేడు అహంకారముతోనే మమకారముండును ఈరెండింటివల్లనే అరిషడ్వర్గములుండును. కాని వీటి నిష్పత్తి ఒకరికొకరికి సంబంధముండదు. దానికి కారణం పూర్వ జన్మకర్మఫలము. పూర్వజన్మ కర్మఫలమనగా జీవులనేక జన్మలలో చేసిన కర్మలన్నియు ( పాపపుణ్యములు) ఆగామి, సంచిత, ప్రారబ్దము అని వెనుకటి అధ్యాయములో చెప్పబడినవి. అహముతో చేసుకున్న కర్మలు ఎన్నడునూ ఫలములనీయక నశించవు అందుకనే ఎవరు చేసిన కర్మవారనుభవించక ఎవరికైనా తప్పదన్నారు పెద్దలు. కర్మలు మూడువిధములు. మానసికము వాచకము కాయకము. వీటివల్ల వచ్చిన కర్మలకు తగిన ఫలము నిచ్చుట ప్రకృతి ధర్మము కనుక వాటిని అనుభవించుట తప్పదు.

సాధారణముగా కోర్కెలకొరకు ఆపద మొక్కులను దేవాలయముల లోని దేవుళ్ళకు మొక్కుతారు. అవితీరినా తీరకపోయినా ఆదేవాలయములకు వెళ్ళివస్తుంటారు. దానికే మూఢనమ్మకములంటారు. ఎవరికి వారే తమ ఉన్నతికి సద్గురువులను చేరి బ్రహ్మావిద్య నభ్యసించవలెను. దానితోనే అరిషడ్వర్గములు నిర్మూలమగును.

బ్రహ్మావిద్యనేర్వని ప్రతివేదాంతి తమ తమ ఉపన్యాసములలో ముందుగా అరిషడ్వర్గములను జయించాలి అని చెబుతారు కాని ఎలా జయించాలో వారికే తెలియదు. కనుక ఇలా జయించాలి అని వివరణ యివ్వలేరు. అట్లే తన్నుతాను తెలుసుకోవాలి అనికొందరు చెబుతారు. దాని వివరణ కూడా తన్నుతాను ఎలా తెలుసుకోవాలి అనే విషయాన్ని చెప్పలేరు. ఇది చాలా చిక్కుముడి ఉదాహరణ కు ఒక చెట్టుకు కొమ్మలు ఆకులు ఉన్నట్లే ప్రతిమానవునికి అరిషడ్వర్గాలుండు

ను. ఆచెట్టు యొక్క కొమ్మలలో ఒక కొమ్మను నరికిన యెడల దాని చుట్టూ మరికొన్ని కొమ్మలు వచ్చును. అట్లే మరి యొక కొమ్మను నరికిన దానిచుట్టూ కూడా మరి కొన్ని కొమ్మలు వచ్చును. ఆవిషయం తెలియనివారుండరు. కనుక చెట్టుకొమ్మలను నరకుటకంటె దాని తల్లి వేరును తీసివేసిన యెడల చెట్టు, చెట్టుకొమ్మలు ఆకులు కాయలు అన్నీ నశించును.

మానవునకు "అహము" అనే కర్తృత్వము తల్లివేరు అదే అవిద్య కనుక దానివల్లనే కర్మలు కర్మఫలములు వాటి వలన అరిషడ్వర్గములు కలుగుచున్నవి. కనుక మానవులు అరిషడ్వర్గములను పూర్తిగా తొలగించుకొనవలెనంటే బ్రహ్మవిద్యాగురువును ఆశ్రయించి ఆయన చెప్పిన విధానములను పాటించి అహమును నిర్మూలించిన యెడల అరిషడ్వర్గములు పూర్తిగా నిర్మూలమగును. అపుడే తన్నుతాను తెలుసుకొనగలడు. ఆవిధముగా అహము రహితమయిన పుడు దానితో ఆగామి సంచిత (కర్మలు) ములు నిర్మూలమగును. ప్రారబ్ధము మాత్రము శరీరము అంతమగు వరకు అనుభవించవలసియేయుండును. అంతవరకు ప్రారబ్ధమనే కష్టసుఖములు అనుభవించుట తప్పదు. పైవిధముగా సంచితము నశించినందువలన ఈజన్మలో అహంరహితము వలన చేసిన కర్మలు సంచితమున చేరుటకు అవకాశములేదు. అందుచేత సూక్ష్మశరీరము నశించును. అదే జన్మరాహిత్యము. అదే బ్రహ్మవిద్య ఫలితము అదే నిత్యశాంతి.

పూర్వజన్మ సుకృతము లేని యెడల బ్రహ్మవిద్యయందాసక్తి ఎవరికీ కలగదు. కలిగినాఫలించదు. పరిపూర్ణ శ్రద్ధతో సద్గురుని యందు త్రికరణ సుద్ధి గలిగిన భక్తి ప్రపత్తులు కలగవు. సద్గురుని బ్రహ్మ విష్ణు మహేశ్వరులకంటె అతీతమైన పరబ్రహ్మ స్వరూపుడని నమ్మిక అందరికి కలగదు. ఆవిధముగా పరిపూర్ణమయిన భక్తిశ్రద్ధలుగలవారికే బ్రహ్మవిద్యకుదురును. అందుచేతనే శ్రీకృష్ణుడు భగవద్గీత యందు 7వ అధ్యాయము విజ్ఞానయోగము నందు ఈ క్రింది విధముగా చెప్పియున్నాడు.

**3.** శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వత ః

తా॥ అనేక వేల మంది మనుషులలో ఏ ఒకానొకడో మోక్షసిద్ధికై యత్నించు

చున్నాడు. అట్లు యత్నించువారైన అనేక మందిలో ఏ ఒకానొకడు మాత్రమో నన్ను వాస్తవముగా తెలిసికొనగలుగుచున్నాడు.

వ్యాఖ్య :- లోకములో అనేక కోట్లమంది జనులున్నప్పటికిని అందు అధ్యాత్మమార్గమున ప్రవేశించువారు అరుదు. ప్రవేశించి మోక్షసిద్ధికై యత్నించువారు ఇంకను అరుదు అట్లు యత్నించువారిలో కడతేరువాడు భగవదనుభూతిని పూర్ణముగా పొందువాడు ఒకానొకడు మాత్రమే యుండును. ఉదా: మామిడి చెట్టునకు అనేక వేల పువ్వులు పూయును. అందుచాలావరకు రాలిపోయి ఏకొన్ని యోపిందెలుగా మారును. అవియు చాలా రాలిపోగా కొన్ని చివరికి కాయలగును. అవికూడా మధ్యలో కొన్ని కుళ్ళిరాలును. చివరికి కొన్ని మాత్రమే ఫలములుగా యేర్పడును. అట్లే ముముక్షువుల విషయమున్ను. ఇటువంటి బ్రహ్మవిద్య విషయమునందు భక్తిభావము యేర్పడవలెననిన బహుజన్మల సుకృతము సజ్జన సాంగత్యము ఉండవలెను. మాయా ప్రవాహమున అనేక మూఢనమ్మకము గలవారు. అవివేకులు కొట్టుకొని పోవుదురు.

ఆత్మానుభూతి మాటలతో కలుగునదికాదు. దానికి ఎంతయో మహత్తర పురుషప్రయత్నము పట్టుదల త్యాగము అవసరము. ఇంద్రియ నిగ్రహము మనస్సంయమము మున్నగునవి ఆవశ్యకములు. సోమరులు ఆ లక్ష్యము నెన్నటికి చేరలేరు.

కనుక అరిషడ్వర్గములు సద్గురుని చేరి అహమును నిర్మూలించుకొనిన వెనువెంటనే నిర్మూలమగును.



# జన్మరాహిత్యము

సద్గురువనగా బ్రహ్మవిష్ణు మహేశ్వరుల కంటె అతీతమయిన పరబ్రహ్మ స్వరూపుడు. ఈవిషయము స్కాంద పురాణము నందు ఉత్తర భాగములో మహేశ్వరుడు పార్వతికి చెప్పిన "గురుగీత" లో ఈక్రింది శ్లోకమును చూడుడు.

**58.** శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మా తస్మై శ్రీ గురువేన్నమః

**తా॥** చతుర్వేద సారమగు మహావాక్యముల యొక్క లక్ష్యార్థ లక్ష్యాతీతమును బోధించునట్టి వాడగుటచే గురుదేవుడు చతుర్ముఖములతో చతుర్వేదములను ఉపదేశించు బ్రహ్మదేవుడై యున్నాడు. జ్ఞాన బోధలను జెప్పి అజ్ఞానములో పడనీయకుండా సర్వులను రక్షించు చున్న వాడగుటచే శ్రీగురుదేవుడు సర్వులను రక్షించునట్టి విష్ణువైయున్నాడు. శరణుజొచ్చినవారి సకల అజ్ఞానవములను హరింపజేయుచున్న వాడగుటచే శ్రీగురుదేవుడు సకలజగములను లయమొనరించు దేవుడగు మహేశ్వరుడై యొప్పు చున్నాడు.

ఇదియేగాక త్రిగుణాతీతమగు బ్రహ్మతత్త్వమగుటచే శ్రీగురువు సాక్షాత్పర బ్రహ్మయై ప్రకాశించుచున్నాడు. అట్టి గురుదేవునకు నమస్కారము.

గురుడనగా మరియొక విధముగా" గురుగీతలో చెప్పిన శ్లోకము.

**111.** శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంధ్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షి భూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుంతం నమామి.

**తా॥** శ్రీ గురుదేవుడు బ్రహ్మానంద స్వరూపుడు శాశ్విత సుఖము నిచ్చువాడు. ఒకే స్వరూపుడు జ్ఞానస్వరూపుడు. సీతోష్ణ సుఖదుఃఖాది ద్వంధ్వముల నతిక్రమించిన వాడును ఆకాశముతో సమానమైన వాడును తత్త్వమసి మొదలైన వాక్యముల యొక్క లక్ష్యార్థములతో లక్ష్యాతీతమైన వాడును

అద్వితీయుడును, శాశ్వితుడును నిర్మలుడును చలనములేని అచలుడు. సమస్తప్రాణుల యొక్క బుద్ధికి సాక్షిగ నుండువాడు. భావములకతీతుడు. త్రికాలములతో బాధింపబడనివాడును. అటువంటి గురుమూర్తిని గూర్చి నమస్కరించుచున్నాను. అని శివుడు పార్వతి అడిగిన ప్రశ్న " ప్రపంచము లోని అందరి నమస్కారములు పొందవలసిన మీరు ఎవరిని గూర్చి నమస్కరించు చున్నారు." అని పార్వతి శివుని అడిగిన ప్రశ్నకు పైవిధముగా సమాధానము చెప్పినాడు.

ఈ బ్రహ్మవిద్య రాజమార్గము రాజయోగము దీనిని బోధించు సద్గురువులు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల కతీతమయిన పరబ్రహ్మ స్వరూపులని తెలుసుకున్నాము. ఆయనను ఆశ్రయించి త్రికరణశుద్ధిగా భక్తితో నీ తను ధనమాన ప్రాణము లర్పించిన చో నీయొక్క అహంకారమమకారములనే కర్తృత్వము రహితమై అరిషడ్వర్గములు నిర్మూలమగును. అటువంటి వారి స్థితి. ఈ క్రిందినీయబడిన శ్లోకము వలన తెలుసుకొందురు.

**ఉదా: భగవద్గీత ౬వ అధ్యాయము ఆత్మసంయమ యోగము.**

9. శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బన్ధుషు
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే

తా॥ ప్రత్యుపకారమును గోరకయే మేలొనర్చు వారియందు, ప్రతి ఫలమును గోరిమేలు చేయువారి యందు, శత్రువులందు, తటస్థులందు, బంధువులందు, సజ్జనులందు, పాపులందు సమభావము గలిగియుండు వాడే ఉత్తముడు అటువంటి వారికి అరిషడ్వర్గములుండవు.

**మరియొక ఉదాహరణ భగవద్గీత 5 వ అధ్యాయము కర్మసన్యాస యోగము.**

18. శ్లో॥ విద్యావినయ సంపన్నే బ్రహ్మణే గవి హస్తిని.
శుని చైవ స్వపాకేచ పణ్డితాః సమదర్శినః

తా॥ విద్య, వినయము గలిగియున్న బ్రాహ్మణునియందును. గోవునందును ఏనుగునందును కుక్కయందును, కుక్కమాంసము వండుకొని తిను చండాలుని యందును సమదృష్టిగలవారే (వారిని సమముగాజూచువారే) జ్ఞానులు (ఆత్మానుభవము గలవారు) అని చెప్పుదురు.

సూర్యుడు గంగోదకమునందును మద్యపాత్రజలమునందును, ప్రతిఫలించునట్లు జ్ఞానులన్నిటిని ఒకటిగనే చూచెదరు. బ్రహ్మదృష్టితో ప్రేమించెదరు. కావున సర్వజీవులయందును సమదృష్టిని వికసింపజేసుకొని బ్రహ్మానుభూతిని నొందవలయునని భావము.

సామాన్యముగా పండితుడనగా పాండిత్యము గలవాడని జనులుతలచెదరు. కాని దీని భావ మదికాదు. సమదృష్టిగలవాడే పండితుడని పెద్దలువచించిరి. ఇట్లు సమదృష్టిగలవారు చదువురానివారైనను పండితులే అదిలేని వారు ఎంతటి మహా పాండిత్యము గలిగియున్నను పరమార్థ దృష్టి యందు అజ్ఞానులేయగుదురు. కనుక చదువురానివారైనను సద్గురుని వద్ద బ్రహ్మవిద్యకు అర్హులే.

బ్రహ్మజ్ఞానులు దేహవాసన లోకవాసన శాస్త్రవాసనయను వాసనాత్రయమున కతీతులై హృదయగ్రంధి వీడి భ్రాంతి రహితులగుదురు. అట్టివారి స్థితి ఈక్రింది విధముగా నుండును.

**ఉదా: భగవద్గీత 5వ అధ్యాయము కర్మసన్యాసయోగము**

8. శ్లో॥ నైవ కించిత్కరోమీతి యుక్తోమన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్

9. శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతిధారయన్

తా॥ పరమార్థతత్వము నెరింగిన యోగయుక్తుడు (ఆత్మయందు నెలకొనిన చిత్తముగలవాడు) చూచుచున్నను. వినుచున్నను, తాకుచున్నను, వాసన చూచుచున్నను, నిదురించు చున్నను, ఊపిరివిడుచుచున్నను, మాట్లాడుచున్నను, తినుచున్నను, నడుచుచున్నను, విడుచుచున్నను, గ్రహించుచున్నను, కండ్లను తెరుచుచున్నను, మూయుచున్నను. ఇంద్రియములు (వానివాని ) విషయములందు ప్రవర్తించుచున్నవని నిశ్చయించిన వాడై నేనొకింతైనను ఏమియు చేయుటలేదు అనియే తలంచును( ఆయాకార్యము లందు కర్తృత్వ బుద్ధి లేకుండును).

శ్రీకృష్ణుడు ఒకసందర్భములో నేను అస్ఖలిత బ్రహ్మచారినన్నాడు. అనివిని యున్నాము ఆస్థితి ఇదే. ఉపదేశకాలమందు సద్గురుదేవునికి తను

ధనమాన ప్రాణములను అర్పించిన శిష్యుడు గురువు సూచించిన ప్రకారముగా సాధన చతుష్టయ సంపత్తిని అభ్యసించి పరిపక్వ స్థితిని పొందుటవలన శరీరభ్రాంతి నశించును ఆస్థితి యీ క్రింది విధముగా నుండును.

పచ్చివెలగకాయ గుజ్జు దాని బెరడును అంటిపెట్టుకొనియుండును. ప్రకృతి సంబంధమయిన ప్రక్రియతో పక్వమై పండును. అపుడు గజ్జునకును బెరడునకును సంబంధము దానంతటదే వీడపోవును. అట్లే సంసారములో (ప్రపంచము లో) సాధన సంపత్యానంతరము బ్రహ్మజ్ఞాని అందరితో కలసిమెలసి యున్నప్పటికి దేనితోను సంబంధము లేని స్థితి యేర్పడును. అదియే భ్రాంతి రహితము ఆత్మసాక్షాత్కార స్థితి. అదియే కర్తృత్వ రహితస్థితి అని పెద్దలందురు.

**ఉదా: భగవద్గీత 5వ అధ్యాయము కర్మసన్యాసము.**

**10.** శ్లో॥ బ్రహ్మణ్యాదాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతియః।
లిప్యతేనసపాపేన పద్మపత్రమివామ్భసా ॥

తా॥ ఎవడుతాను చేయు కర్మలను సద్గురునకు అర్పించి సంగమును (ఆసక్తిని) విడిచి చేయుచున్నాడో అట్టివాడు తామరాకును నీరంటునట్లు పాపముచే నంటబడకుండును.

శబ్ద స్పర్శ రూపరస గంధములను సద్గురునకు దారవోసిన శిష్యుడు తనస్థితి శబ్దస్పర్శ రూప రస గంధములేని స్థితియే. అదియే యదార్ధము. ఆస్థితి ప్రపంచమంతట దేనిసహాయము లేక నిండి యుండుట లేకుండుట అను రెండూ నెరుగనిస్థితి. (అదేయేకాత్మ) అదే నీవు నేను కాని స్థితి. అది ప్రపంచమంతట 84లక్షల జీవరాసులలో ఉన్నయేకాత్మ. ఆస్థితి యెట్లుండు ననగా.

**ఉదా: భగవద్గీత 2వ అధ్యాయము సాంఖ్యయోగము.**

**23.** శ్లో॥ నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనందహతి పావకః
నచైనం క్లేదయన్త్యాపోనశోషయతి మారుతః

తా॥ ఈ ఆత్మను ఆయుధములుయేవియు ఛేదింపజాలవు. అగ్ని దహింప జాలదు. నీరు తడుపజాలదు, గాలియెండిపజాలదు, అది పంచభూతములకు లోబడునదికాదు. అదే సద్గురు శిష్యుల స్థితి.

కర్పూరము అగ్నిని కలసినపుడు ఒకేసారి మండి ఆరిపోవును. అపుడు కర్పూరముగాని అగ్నిగాని కనబడవు. ఆస్థితి యెట్టిదో గురుశిష్యుల స్థితి అట్టిదగును. అనగా శిష్యుడు త్రికరణ శుద్ధిగలిగి గురునియందు త్రైలధారవంటి నమ్మిక భక్తికలిగిన శిష్యుని శిరస్సుపై పరమానందముతో పరమగురుడు తనహస్తము నుంచినయెడల హస్తమస్తక సంయోగమందురు. అపుడా శిష్యుడు లేకుండాపోవును. గురుని స్థితి కూడా అట్టిదే కనుక, గురుశిష్యులు లేనివారే అగుదురు. ఆగురుశిష్యులు ప్రపంచములో నున్నట్లున్నను, కర్తృత్వరహితులై నందువలన లేనివారే అగుదురు. అనగా కాలిపోయిన నులక తాటివుండ వంటివారు. అనగా ఆస్థితిలో ఆనులకతాడు ఉపయోగించుటకు పనికిరాదు గదా! అదే విధముగా ఆస్థితిని పొందిన సూక్ష్మశరీరమునకు తిరిగి జన్మవుండదు. అదియే జన్మరాహిత్యస్థితి.



# విద్య -గురువు -శిష్యుడు

అందరూ గురువులుకారు. లోకమందు 64 విద్యలుగలవు. అవి 65వ విద్యయైన బ్రహ్మవిద్యకు సాటికావు. ఆ 64విద్యలవలన దేహభ్రాంతి లోకభ్రాంతిని నశింపజేయు అవకాశములేదు. అందుచేత ఆవిద్యలను నేర్పెడి గురువులు సామాన్యులేకాని అతీతులుకారు. జ్ఞానమును బోధించెడివాడు సద్గురువు కాదు. భక్తిని బోధించువాడు సద్గురువు కాదు. ఇలా ఎంత మందిని లోకవిద్యలు బోధించెడి గురువుల గురించి చెప్పినా ప్రయోజనము లేదు. జగద్భ్రాంతిని లేకుండా చేసినవాడే సద్గురువు పరమగురువు మిగిలినవారు తమను తాము తెలిసికొనలేరు మరియొకరికి తెలుపలేరు.

ప్రపంచములో విద్య అనే పదము అతిపవిత్రమైనది. దీనికి పంచ భూతముల వలెనే జాతి మతము వర్ణము అను తారతమ్యములు లేవు. అందుచేత ఏవిద్యను నేర్పెడి గురువులు గాని విద్యను నేర్చుకొనే శిష్యులుగాని జాతి మత వర్ణములకతీతులై వుండవలెను. స్వపరభేదములుండరాదు. అపుడే ఆవిద్య పవిత్రమైనదిగా రాణిస్తుంది. లేనియెడల విద్యను చెప్పెడి గురువులకుగాని విద్యను నేర్చుకొనెడి శిష్యులకుగాని ఆవిద్య రాణించదు.

లోకమందుగల 64 విద్యలలో విలువిద్య గురించి ఉదాహరణగా పరశురాముడు- కర్ణుడు అను గురుశిష్యుల గురించిన వృత్తాంతము పరిశీలించెదము.

పరశురాముడు అవతారపురుషుడు (దశావతారములలో ఒక అవతార మందురు) ఇతడు తల్లిదండ్రులపై అపరిమితమైన ప్రేమ భక్తి గలవాడు.

ఒకనాడు ఒక సందర్భములో తండ్రిజమదగ్ని కుమారునితో నీతల్లి శిరస్సును ఖండించమని అనగానే పరశురాముడు తన తల్లి శిరస్సును నరికి వేసినాడు. కుమారుని మెచ్చి నీకేవరము కావలెనో అడగమనగా మాతృభక్తితో నాతల్లిని బ్రతికించమని పేడుకున్నాడు. తల్లి రేణుక తిరిగి బ్రతికినది. ఆవిధముగా మాతాపితృల భక్తిని నిరూపించుకున్నాడు.

ఒకనాడు కార్తవీర్యార్జునుడు తన ఆశ్రమమునకు వచ్చి జమదగ్ని యిచ్చిన విందారగించి ఆవిందును సమకూర్చిన కామధేనువును యిమ్మని అడగగా దానిని జమదగ్ని యివ్వలేదని అతనిని కార్తవీర్యార్జునుడు శిరస్సును ఖండించినాడు. ఆ విధానము వలన పరశురాముడు రాజులపై కక్షపెంచుకొని చాలమంది రాజులను చంపివేయు చుండెడివాడు. అతడు బ్రహ్మవిద్యను నేర్చుకున్నవాడు కాదు.

అటువంటి సమయములో కుంతి కుమారుడు కర్ణుడు విలువిద్యను పరశురాముని వద్దనే నేర్చుకొనవలెననిడి తలంపువలన బ్రాహ్మణవేషము వేయవలసి వచ్చినది. ఆవిధముగా గురువుపై భక్తి విశ్వాసములతో విలువిద్యను నేర్చుకొనుచున్నాడు. ఒకనాడు కర్ణుడు గురుసుశ్రూషచేస్తూవున్నాడు. అతని తొడమీద గురువుగారు తలపెట్టుకొని నిద్రిస్తున్నాడు. ఆసమయములో ఒక పురుగు కర్ణుని తొడ క్రిందజేరి ఆ తొడను గాయపరస్తూ అమితమైన బాధపెడుతూవున్నది. తొడ నుండి రక్తము ధారగా ప్రవహిస్తూవున్నది. అటువంటి సమయములో గురువుగారికి నిద్రాభంగము కలుగునని తనకు కలుగుచున్న భయంకరమైన బాధను సహించుకుంటూ కదలకమెదలక కూర్చుని గురు సేవచేస్తున్నాడు. ఆరక్తము యొక్క తడి తగిలి పరశురామునికి మెలకువ వచ్చినది. ఆరక్తమును చూచి ఈరక్తమేమిటి అని ప్రశ్నించినాడు. ఒక పురుగు నాతొడను దొలిచినందు వలన రక్తము వస్తుందని కర్ణుడు చెప్పినాడు. ఇటువంటి సందర్భములో అంత బాధను బ్రాహ్మణుడైతే ఓర్చుకొనలేడని గ్రహించి " నువ్వెవడవు" అని కర్ణుని ప్రశ్నించినాడు. కర్ణుడు తన విషయము చెప్పగానే వుగ్రుడై ఇంతవరకు నీవు నేర్చుకున్న విలు విద్య నీకు అవసరానికి పనికిరాదని శపించినాడు అయినా ఆవిలువిద్య బ్రహ్మ విద్యకాదు. కర్ణుడు భక్తివిశ్వాసములో అగ్రగణ్యుడు. అతడు సామాన్యుడు కాడు. అందుకొక ఉదాహరణ చూడుడు. కౌరవ పాండవుల కొలువు నందు విలువిద్యా పోటీలలో సూతపుత్రుడు పాల్గొనకూడదని కర్ణుని గురించి అభ్యంతరము పెట్టగా దుర్యోధనుడు కర్ణునికి అంగరాజ్యము నిచ్చి దానికి రాజునుచేసి ఆ విలువిద్యా పోటీలలో పాల్గొను అవకాశము కల్పించి కర్ణుని గౌరవమును కాపాడినాడు. ఆవిశ్వాసము చేత దుర్యోధనుడు దుర్మార్గుడైనప్పటికీ కర్ణుడు తనకు విశ్వాసపాత్రుడై అతనిని ఎట్టి పరిస్థితులలోను విడిచిపెట్టక కౌరవుల దుష్ట చతుష్టయము లో ఒకడైనాడు.

ఒకనాడు కురుక్షేత్ర యుద్ధసమయమున కృష్ణుడు కర్ణుని వద్దకు వచ్చి నీవు కుంతి కుమారుడవు కనుక పాండవుల పక్షానికి రావలసినదని అలా వచ్చినట్లయితే నీవు ధర్మరాజుకంటే పెద్దవాడవు కాబట్టి పాండవుల పక్షానికి నీవు రాజవుతావని అదియును గాక ద్రౌపది నీకు కూడా భార్య అవుతుందని ప్రలోభపెట్టి అడిగినాడు. మరియొక సమయమున కుంతి కూడా కర్ణుని వద్దకు వెళ్ళి అదే విధముగా చెప్పినా దుర్యోధనునిపై గల విశ్వాసము చేత ఆమాటలు వినిపించుకొనలేదు.

కర్ణుడు అటువంటి ఉత్తముడైనను పరశురాముడు రాచకులము పట్ల కక్ష గలవాడని తెలిసినందు వలన విలువిద్యను ఆయన వద్దనే నేర్చు కొనవలెననెడి కోరికతో బ్రాహ్మణ వేషముతో పరశురాముని ఆశ్రయించి విలు విద్య నేర్చుకున్నాడు.

ఇక్కడ మనము తెలుసుకొనవలసిన విషయం ఏమిటి అంటే సామాన్యుడైనా అవతార పురుషుడైనా సద్గురుని ద్వారా బ్రహ్మజ్ఞానమును నేర్చుకొననివాడు పశువుతో సమానమన్నారు పెద్దలు.

అవతారపురుషులైన శ్రీరాముడు త్రేతాయుగములోను, శ్రీ కృష్ణుడు ద్వాపరయుగములోను బ్రహ్మవిద్యను నేర్చుకున్నారు. అటువంటి బ్రహ్మజ్ఞానులకు జాతిమతములపై విభేదముండదు. అటువంటి స్థితి బ్రహ్మవిద్యవలన కలుగును.

అలాకాక పరశురాముడు " నీవు నేర్చుకున్న ఈవిలువిద్య సమయానికి పనికిరాదని శపించినాడంటె విద్య చెప్పిన గురువునకు విద్య నేర్చుకున్న శిష్యునకును విలువలేదు గదా. పరశురాముని కాలములో సత్యమునకు ఎక్కువ విలువ వుండెడిది.

కనుక కర్ణుడు అసత్యము చెప్పినాడనే కోపముతో నీకీ విద్య సమయానికి పనికిరాదని శపించినా కర్ణుని సత్శీలమును తెలుసుకొనలేని దుస్థితి వల్లను. అపరిమిత కోపిష్టి అవడం వల్లను పరశురాముడు ఆశాపమునకు శాప విమోచనము చెప్పలేదు.

కర్ణుడు గురుని యెడల యెనలేని భక్తి విశ్వాసములతో గురువునకు అపరిమితమయిన సేవ చేసిన వాడగుటచే పరశరాముడు గురువుగా చూపవలసిన కరుణా కటాక్షములు కూడా చూపలేదు కారణం పరశురాముడు అవతారపురుషుడైనా యే గురువువద్దనూ బ్రహ్మవిద్యను అభ్యసించినట్లు చెప్పబడియుండలేదు. కనుక అవిద్య గల వాడగుటయే దానికి కారణం.

అందుచేత లోక సంబంధమయిన **64** విద్యలలో యేవిద్య యెవరు నేర్చుకున్నను కులమత విచక్షణ ఉన్నపుడు ప్రయోజనముండదు. అటువంటి వారు సామాన్యులేగాని అతీతులుకారు.

బ్రహ్మవిద్యా విషయములో గురువుగాని శిష్యుడుగాని జాతి మత

వర్ణముల కతీతులై బ్రహ్మవిద్యను ప్రారంభించవలెనని "గురుగీత " లో మహేశ్వరుడు పార్వతికి చెప్పిన శ్లోకము చూడుడు.

41. శ్లో॥ స్వాశ్రమం చ స్వజాతిం చ స్వకీర్తిం పుష్టివర్ధనమ్
ఏతత్సర్వం పరిత్యజ్య గురుమేవ సమాశ్రయేత్ ॥

తా॥ తాను యే ఆశ్రమము లోనున్న వాడైనను ఆశ్రమాభిమానమును వదలి కీర్తి ప్రతిష్టలను ఐశ్వర్యములను లెక్కించక సంసార దుఃఖతప్తుడై దేహేంద్రియ అభిమానమును కూడా వదలి కడు దీనుడై అనన్య శరణ్యుడై ఎక్కడ వుండినను శ్రీ గురుదేవునే (వారి జాతి మత భేదములను కూడా చూడక) తాను బ్రాహ్మణ జాతికి చెందిన వాడైనను కులాభిమానమును వదలి) గొప్పభక్తితో ఆశ్రయించాలి. ఉదా: జనకుడు ఇటువంటి బోధకొరకు మాంసం అమ్ముకుని జీవించే ధర్మవ్యాధుడనే సద్గురువు వద్దకు మారువేషమున వెళ్ళి వినేవాడు.

ఈవిధముగా గురుదేవుని యొద్దకు శిష్యుడు అభిమాన రహితుడై చేరి బ్రహ్మవిద్యను అభ్యసించవలెను.

ద్వాపరయుగమున సాందీపుని యొద్ద కృష్ణుడు బలరాముడు, సుదాముడను కుచేలుడు విద్యను నేర్చుకున్నారు. కుచేలుడు బ్రాహ్మణుడు శ్రీకృష్ణ బలరాములు యాదవులు కాని వీరి యెడల విచక్షణగాని ఆర్థిక తారతమ్యములుగాని సాందీపుడు చూపలేదు. కారణం బ్రహ్మవిద్య యొక్క విధానమే అది. అందుచేత లోకసంబంధమయిన 64 విద్యలలో దేనిని ఎవరు నేర్చుకొనవలెనన్నను వాటికి అతీతమయిన బ్రహ్మవిద్యను నేర్చుకొవలె నన్నను గురుశిష్యులు జాతి మత వర్ణముల కతీతులై వుండవలెను. మరియు బ్రహ్మవిద్యవలన సత్త్వరజః తమో గుణముల కతీతులై వుండవలెను.

బ్రహ్మ విద్యయందు పరమగురుని లక్షణములు గురుగీత యందు.

279. శ్లో॥ సర్వసందేహ సందోహ నిర్మూలన విచక్షణః
జన్మమృత్యు భయఘ్నోయః స గురుః పరమోమతః

తా॥ సర్వగురువులలో శ్రేష్ఠ గురువును నిరూపించుచున్నారు. కేవల దివ్యజ్ఞాన స్వరూపుడు సాక్షాదీశ్వరుడు పరమగురువు. శాస్త్రముల చేతను ననేక యుక్తుల చేతను, దృష్టాంతములచేతను అవాఙ్మానస గోచరమగు జీవ బ్రహ్మైక్యతత్త్వము బోధపడునది కాదు. అటులనే తపోధ్యానాదుల చేతను ఆతత్త్వము

గోచరముకాదు. ఇట్లు దురవగాహమగు పరమతత్త్వము సకల సందేహములు పరంపరగా వచ్చిపడుచున్నను వానినెల్ల క్షణములో జ్ఞాన సముద్రయగు చిన్ముద్ర చేత నశింపజేసి బోధించునట్టి మహానుభావుడును అఖండ దివ్యజ్ఞాన మూర్తియు. నిశ్శేషముగా జనన మరణభయ నాశకుడైన తత్త్వజ్ఞాని యగు మహనీయాత్ముడు అనగా చిన్ముద్రచేత శిష్యుల యొక్క జీవ బ్రహ్మైక్య విషయములోగల సకల సందేహములను నిర్మూలన మొనరించి శిష్యులనఖండ పరిపూర్ణ జ్ఞాన సంపన్నులను జేయువాడు పరమఃగురుః సర్వవిలక్షణ మహోత్కృష్ట పరమతత్త్వోప దేశికుడగుటచే పరమగురువని తత్త్వజ్ఞుల యొక్క సమ్మతమగు మతమైయున్నది. లోకమునందిట్టి పరమ గురువు గానిపించుటలేదు. ముందు తెలుపబడినట్టి యీ సప్త గురువులలో మహాపాపియగు నిషిద్ధ గురువును విడనాడి మిగిలిన ఆరుగురు గురువులును స్వీకరింపదగిన వారలే. వారిచేత శిష్యులున్నత స్థితికి వచ్చుచున్నారు. అందుచే వారి యందు కృతజ్ఞతాబుద్ధిని జూపుచునే యుండవలయును. అయినను యీ పరమగురుడు మాత్రము సర్వజ్ఞుడు సర్వేశ్వర స్వరూపుడు. ఈపరమ గురు స్థానము శ్రీ దక్షిణా మూర్తి యొకరికి మాత్రమేగలదని వేదాంత శాస్త్రజ్ఞుల నిర్ణయము పైన దెలిపిన ప్రకారము గురువులను విచారించి తమయొక్క యజ్ఞానము ఏగురువుచే క్షయమొందునో యాతడే ప్రత్యక్ష పరమగురువు. సాక్షాదీశ్వరుడు పరబ్రహ్మ స్వరూపుడు. సత్యము ముమ్మారు సత్యము.

**గురుగీత**

**280.** శ్లో॥ బహుజన్మ కృతాత్పుణ్యాల్లభ్యతే ఉ సౌ మహా గురుః
లబ్ధ్వాఉముం నపునర్యాతి శిష్యస్సంసార బన్ధనమ్

తా॥ సకల జన్మబన్ధములను ఛేదించి జ్ఞానమొసంగు పరమగురుడు మహాదుర్లభుడని తెలుపుచున్నారు. పరమ జ్ఞాన స్వరూపుడగు పరమగురువు అనేక జన్మలనుంచి చేసినట్టి యనన్త పుణ్యరాసుల చేతనే లభించుచున్నాడు. ఎందుకనగా ననేక జన్మలనుంచి వచ్చుచున్న యనేక వాసనాజాలములతో కూడుకున్న ప్రబల సంసార బంధనము ఏమహామహుని యపారకరుణా కటాక్షవీక్షణములచే శిష్యుడు తిరిగి పొందుట లేదో, శిష్యుడు కేవల పరబ్రహ్మ స్వరూపుడగుచున్నాడో అట్టి పరమగురువును పొందుట మహాదుర్లభము.

అట్టి మహాత్ముని శరణు పొందినచో త్రిలోకములందును భయము లేదు. అంతయు చైతన్యమాత్రుడై యుంటున్నాడు. "గురుగీత" నుండి

**281.** శ్లో॥ ఏవంబహువిదా లోకే గురువస్సన్తి పార్వతి
తేషు సర్వ ప్రయత్నేన సేవ్యోహి పరమోగురుః ॥

తా॥ లోకములో అనేక విధములైన గురువులుంటున్నారు. ఓపార్వతీ! అందరినీ సేవింపరాదు. సర్వశ్రేష్టుడై అజ్ఞాన ధ్వంసకుడైన పరమగురువే అన్ని విధముల సేవింపదగినవాడు. "గురుగీత "నుండి

**344.** శ్లో॥ సప్తకోటి మహామంత్రాః చిత్తవిభ్రమకారకాః
ఏకఏవ మహామంత్రో గురురిత్యక్షర ద్వయమ్ ॥

తా॥ జనులు సులభముగ తరించు మహోత్తమ మంత్రమును చెప్పుచున్నారు. ప్రత్యక్షముగా అన్ని విధములచే మార్జాల కిషోరన్యాయము ననుసరించి నిరంతరము సంరక్షించుచున్న శ్రీగురుదేవుడే సాక్షాన్మహేశ్వరుడు. "శివ" అను మహా మంత్రమువలె "గురు" అనుమహామంత్రము తారక మంత్రమై భక్తులను తరింపజేయుచున్నది. ఏడుకోట్ల మహామంత్రములు కూడా చిత్తమును చెరచునవియేగాని వానిచే కొంచెమైనను జ్ఞానము లభించదు శాంతియు లభించదు. గురు అను రెండక్షర మంత్రము చిత్తశాంతిని కలిగించి జ్ఞానదాయిగానున్నది. తరించువారికి ఒకే మంత్రము లక్ష్యార్థము ఒకటే చాలును.

**"గురుగీత" నుండి మరుయొక ఉదాహరణ.**

**343.** శ్లో॥ సంసార సాగర సముద్ధరణైక మంత్రం
బ్రహ్మాదిదేవ ముని పూజిత సిద్ధ మంత్రమ్
దారిద్ర్య దుఃఖ భవరోగ వినాశమంత్రం
వందే మహాభయహరం గురు రాజ మంత్రం

తా॥ "గురు " అను మంత్రము యొక్క స్వరూపమును తెలుపుచు దానిని స్మరించుచున్నారు. సంసార సముద్రము నుండి దీనజనుల నుద్ధరించుటకు ముఖ్యమగు మంత్రమైనదియు బ్రహ్మదేవుడు మొదలగు దేవాది దేవతల చేతను సతతము పూజింపబడుచున్నదై సకల సిద్ధుల నొసగు సిద్ధులయొక్క మంత్రమైనదియు దారిద్ర్యదుఃఖమును సంసారవ్యాదిని నశింపజేయునట్టి

మంత్రమైనదియు నిత్యమ జ్ఞానముచే జనించు మహాభయమగు మరణ భీతిని క్షణములో నివారించునదియు సకల మంత్రములలో శ్రేష్ఠమైనదియునగు గురుమంత్రమును ఆమంత్ర స్వరూపుడగు గురుదేవుని సతతము ప్రణమిల్లు చున్నారు. అన్ని విధములుగా అది యెల్లవేళల రక్షించుగాక జ్ఞానప్రదాయియగు గాక శ్రీ గురుకృపచే పరమశాంతి గలుగుగాక

**"గురుగీత" నుండి**

**342.** శ్లో॥ శివక్రోదాద్గురు స్త్రాతా గురుక్రోధాచ్ఛివోన హి।
తస్మాత్సర్వప్రయత్నేన గురోరాజ్ఞాం న లంఘయేత్॥

తా॥ ఒకవేళ మహేశ్వరునికి కోపము వచ్చి శాపగ్రస్తుడైన వానిని శ్రీ గురుదేవుడు ఆశాపము నుండి రక్షించుచున్నాడు. వానికి తగునుపాయముల బోధించి వానిని పవిత్రునిగ చేయుచున్నాడు కాని శ్రీ గురుదేవునికి కోపము గలిగెనేని అది యతిక్రమింప శివునకును సాధ్యము గాదు అదెట్టిదనగా క్రిందనున్న కోర్టులో రద్దు చేయబడిన పిర్యాదులను పైకోర్టువారు తిరుగి విచారణకు తీసుకొనిరావచ్చును. అయితే పార్లమెంటు యందు తీర్మానించ బడిన విచారణనుగాని మరి దేనినిగాని రద్దుచేయుట క్రింది కోర్టుకు సాధ్యముగాదు। మరియు అట్లే శ్రీ గురుదేవుని యొక్క కోపము నుల్లంఘించి శాపమును త్రిప్పుటకు మరియొకరికి సాధ్యముకాదు. గురుద్రోహము మహాబలిష్ఠమైనది. సకల దేవతలును గురుద్రోహిని దూరీకరించుచున్నారు. అందువలన ఎప్పుడును శ్రీ గురుదేవుని యొక్క ఆజ్ఞలన్ని విధములుగా పాలింపవల యును. అందుచే పరమ శ్రేయస్సు గలుగుచున్నది. ఇదినిజము.

శ్రీ గురుతత్త్వమును బోధించకూడనివారు ఉదా॥ " గురుగీత"

**315.** శ్లో॥ రహస్యం సర్వశాస్త్రేషు గీతా శాస్త్ర మిదం శివే।
సమ్యక్ పరీక్ష్య వక్తవ్యం సాధకస్య మహాత్మనః॥

తా॥ శ్రీ గురుగీతా తత్త్వమును బోధించు విషయమును తెలుపుచున్నారు. లోకములో అనేకవములగు గీతా శాస్త్రవములున్నవి. అయినను నిది సద్యఃజ్ఞానము నొసంగున దగుటచే వాని నన్నిటిలోను సారవత్తమమైనది కాన మిక్కిలి పరిశుద్ధాత్ముడై ఆర్తిని జెందిన జిజ్ఞాసువునకును వానియోగ్యతను బాగుగ పరీక్షించియే యొసంగవలయును. అపాత్రునికి నొసంగిన విద్య

ప్రకాశించదని భావము. బురదలో పన్నీరు చల్లిన ప్రయోజనము లేనట్లు పాపపంకిలమగు హృదయమున జ్ఞాన పరిమళ ద్రవ్యము చెడిపోవును. ఈవిషయమునకు ప్రమాణము.

**గురుగీత**

**315ఎ.** శ్లో॥ అసిష్యాయా ఉ విరక్తాయ యత్కిఞ్చిదుపదిశ్యతే ।
తత్ప్రయాత్య పవిత్రత్వం గోక్షీరం శ్వదృతావివ ॥

తా॥ పరిశుద్ధమగు మంత్రమ్మైనను శుచి ఆచారము లేనివారి కుపదేశించినచో ఆమంత్రము పవిత్ర గోక్షీరమును కుక్కయొక్క చర్మమందు పోసినచో నెట్లుపవిత్రమ్మైపోవునో ఆప్రకారమపవిత్రతను జెంది ప్రకాశింపక పోవుచున్నది. అగ్ని ప్రజ్వలించు స్వభావము గలదైనను జలము చల్లగనే చల్లారిపోవుచున్నది. ఆప్రకారము మంత్రము మహా పవిత్రమ్మైన దైనను అపవిత్రత ఆచరణ శూన్యత యను వాని వలన నిర్వీర్యమగుచున్నది. కాన పవిత్రాత్మునకు నొసంగ వలయును. అప్పుడు మంత్రశక్తి ప్రతి బంధ రహితమణి వలె ప్రకాశించును.

**"గురుగీత" నుండి**

**316.** శ్లో॥ సత్కర్మ పరిపాకాచ్చ చిత్తశుద్ధిశ్చ ధీమతా ।
సాధకస్యైవ వక్తవ్యా గురుగీతా ప్రయత్నతః ॥

తా॥ అత్మజ్ఞానోపదేశము చిత్త శుద్ధిగలవానికే యోగ్యమని వేదాంత శాస్త్ర నిర్ణయము. కనుక ఈగురుగీతాశాస్త్రము కేవలము జ్ఞానమునే ముఖ్యముగా బోధించుచున్నందున చిత్తము యొక్క పారిశుద్ధ్యము గలిగి పరమ భక్తిగల ముముక్షువునకే ఈగురుగీతా తత్త్వమును ఉపదేశింపవలయును. అట్టి వారికి తత్త్వమును దాచక మిగుల ఆదరముతో వచింపవలయును. ఇట్లనుటచే నిష్కామకర్మయోగముచేనన్తః కరణశుద్ధిని భక్తి యోగముచే నిర్మల నిశ్చల చిత్తమును (శ్రీగురు పర బ్రహ్మతత్త్వమును) గ్రహించవలయునని తాత్పర్యము.

**"గురుగీత" నుండి**

**316ఎ.** శ్లో॥ గురుభక్తి విశుద్ధాన్తః కరణాయ మహాత్మనే
సమ్యక్ పరీక్ష్య దాతవ్యం మాసం షణ్మాసవత్సరం॥

తా॥ శిష్యుని ఒక సంవత్సరం గాని ఆరుమాసములు గాని చివరకు ఒక మాసముగాని పరిక్షించి మంత్రోపదేశము చేయవలెనని శాస్త్రము

విధించుచున్నది. శిష్యుడు ముందుగనే సకల సంకల్పములను నశింపజేసుకొని ఆ గురు దేవుని శరణు పొందవలయును.

**వశిష్ఠగీత (యోగవాసిష్ఠం) ముముక్షవ్యవహార ప్రకరణము జ్ఞానయుక్తి.**

**24.** శ్లో॥ పూర్వాపర సమాధాన క్షమబుద్ధావనిన్దితే
పృష్టం ప్రాజ్ఞేన వక్తవ్యం నాధమే పశుధర్మిణిః॥

తా॥ చెప్పినట్టియు చెప్పనట్టియు విషయములను గూర్చి విచారించి గ్రహింప సామర్థ్యము కలవాడున్నూ పవిత్రమైన వాడున్నూ ఆచరణ కలవాడునగు మనుజునకే ప్రాజ్ఞుడు ఆత్మజ్ఞానమునుపదేశింపవలెనుగాని పశువువలెనీచము గా వ్యవహరించు అధమునకు కాదు.

**గురుగీత**

**305** ఎ. శ్లో॥ సద్ధర్మ శాసకో నిత్యం సదాచార నియోజకః॥
సంప్రదాయీ కృపాపూర్ణః విరాగీ గురురుచ్యతే॥
ఉక్తలక్షణ సమ్పన్నమాచార్యం సర్వవేదినం।
కర్మణా మనసావాచా శివ వత్పూజయేద్గురుమ్॥
పతిహీనా యధా నారీ మాతృహీనోయధా శిశుః।
గురుహీన స్తధాప్రాణీ తస్యజన్మ నిరర్థకమ్॥
తంత్యక్త్వా తాదృశం దేవం యస్సేవ్యేతాన్యదేవతాం।
నహి భాగీరధీం త్యక్త్వా కాంక్ష తే మృగ తృష్ణికామ్॥

తా॥ సంప్రదాయాను సారముగ వచ్చిన వాడును ధర్మమును శాశించు వాడును, దయాపూర్ణుడగు శ్రీ గురుదేవుని శివునివలె త్రికరణశుద్ధిగా పూజింపవలెను భర్తలేని స్త్రీలును తల్లిలేని శిశువులును. గురువు లేని శిష్యులును. శోభించరు వారిజన్మ వ్యర్థము. మహామహిమ సంపన్నుడై జ్ఞానవంతుడగు గురువును వదలి యితరదేవతలను సేవించుట దగ్గరనున్న గంగానదిని విడచి దూరములోనున్న ఎండమావులను సేవించునట్లగును కావున ఆత్మజ్ఞాని యగు గురువును సేవించిన సర్వము సులభముగా లభించును.



# మోక్షసన్యాసము

మోక్షమనగా విడుదల అనగా బంధమునుండి విడుదల. ఏదిబంధము? జనన మరణములు సుఖదుఃఖములు కర్మఫలములు. త్రిగుణములు కర్తృత్వమనే అహంకార మమకారములు ఇవన్నియు బంధము యొక్క వికారములు దీనినే సంసార సముద్రము, వైతరణినది. అని కూడా అందురు. ఈ వైతరిణి నదిని దాటించువాడు స్వపుత్రుడే అనికూడా అందురు. కాని అహంకార మమకారములు నిర్మూలన కొరకు సద్గురుని ఆశ్రయించి బ్రహ్మవిద్యను అభ్యసించిన యెడల ఎవరికివారేదాటగలరు. కాని యెవరూ ఎవరినీ దాటించలేరు. పుట్టిన వారు మరణించవలసినదే మరణించినవారు తిరిగి జన్మించవలసినదే. ఈ జనన మరణములనే బంధమునుండియే విడుదల. అదియే మోక్షము. మోక్షము కావలెనను కోనుటకూడా బంధమే ఈ బంధమునుండి విడివడుట ఎంతటి మహాత్ములకైనా సాధ్యముకాదు.

సద్గురుడే ఈ బంధమునుండి తప్పించును. దేవతులుకూడా ఈ బంధమునుండి తప్పించలేరు. అందుచేత పరమ గురుని చేరిన శిష్యులు భ్రాంతి రహితులై దేహవాసన, లోకవాసన, శాస్త్రవాసన అనే వాసనాత్రయమును రహితము చేసుకొని హృదయగ్రంధిని చేధించుకొని మోక్షభ్రాంతి రహితులగు దురు. అదే మోక్షసన్యాసము. దాని వలనే జన్మరాహిత్యము.

అందుచేత పరమ గురువునకు శిష్యుడు చేయువలసిన సేవ యెట్టిదో గమనించుటకు

**ఉదా: భగవద్గీత 11వ అధ్యాయము విశ్వరూప సందర్శనయోగము.**

**44**వ శ్లో॥ తాస్మాత్ప్రణమ్య ప్రణీధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశ మీడ్యమ్
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్

తా॥ అందువలన నేను శరీరమును భూమిపై సాష్టాంగముగ బడవైచి నమస్కరించి ఈశ్వరుడును స్తుతింపదగినవారును అగు మిమ్ము అనుగ్రహింప వేడుచున్నాను దేవా! కుమారుని అపరాధములను తండ్రివలెను, స్నేహితుని అపరాధమును స్నేహితుడువలెను. ప్రియురాలి అపరాధమును ప్రియుడువలెను నా యొక్క అపరాధమును మీరు క్షమింపుడు.

**ఉదాహరణ : గురుగీత**

**51**వ శ్లో॥ కర్మణా మనసా వాచా సర్వదా ఆరాధయేద్గురుం
దీర్ఘదండం నమస్కృత్య నిర్లజ్జో గురుసన్నిధౌ॥

తా॥ సద్గురుని సన్నిధానమున శిష్యుడు కొంచెమైనను అభిమాన సంకోచభావములు లేనివాడై దీర్ఘముగా దండప్రణామ మాచరించి శ్రీ గురు దేవుని యాజ్ఞకై సమీపమున నిలిచి యెదురు చూచుచుండవలెను. మరియు శ్రీ గురుదేవుడాజ్ఞాపించిన కర్మలను చేయుట చేతను గురుదేవుడు వచించిన వేదాధ్యయనాది పఠనము చేయుట చేతను గురు దేవుని వద్ద శ్రవణము చేసిన దానిని మననము చేయుట చేతను పరిపూర్ణమనో వాక్కాయములు మాడింటినేకము చేసి గురువునెల్లప్పుడు ఆరాధించవలెను అనగా గురుదేవునకెట్లు నమస్కరించవలయునో ఆ పద్ధతి ఇచ్చుట వివరింపబడినది. శరీరమును భూమిపై పూర్తిగా పడవైచి అష్టాంగములను భూమిపై ఆనించి తైలధారవంటి నమ్మిక భక్తితో సాష్టాంగ నమస్కారము చేయవలెను అట్టిక్రియచే అహంకారము గర్వము నశించును దర్పము నశించును. ఈ విధమయిన సాంప్రదాయమును సాష్టాంగ నమస్కార పద్ధతి ప్రవేశపెట్టబడినది. ఇది కేవలము దేహాభిమానమును చంపుటకే. దీనివలన పెద్దల అనుగ్రహమునకు మనుజుడు పాత్రుడు కాగల్గును.

విశ్వామిత్రుడీ ప్రకారముగ చేసి వశిష్టునిచే బ్రహ్మర్షి అనిపించుకొనెను. శరీరముతోపాటు మనసునందు వాక్కునందునూ కూడా వినయము హృదయ పూర్వకముగా నుండవలయును. అపుడు త్రికరణములతోను శ్రీ గురుదేవుని పెద్దలను సేవించినట్లగును.

శిష్యుడు తన అహంకారమును ఆ విధముగ గురువునకు సమర్పించి గురుసేవ తప్పక చేయవలయును గురువరేణ్యుని అనుగ్రహములేనిచో మోక్షమార్గమునకు జనుట కష్టము. కర్తృత్వము (అహంకారము) వదలదు. శుద్ధి చాలా అవసరము మరియుస్థైర్యము, ఇది గురుని అనుగ్రహములేనిదే సాధ్యపడదు. అనగా సద్గురుని త్రికరణశుద్ధిగా నమ్మి సేవించిన సజ్జనులలో సజ్జనునకే అటువంటి ధైర్యము కలుగును ఈ ధైర్యము సామాన్యమైనదికాదు. (సామాన్యునికి ఇటువంటి ధైర్యము ఉండదు) అనగా సుఖములు శుభములు

గౌరవ మర్యాదలు జరిగినప్పుడు గర్వముతో పొంగిపోకుండాను, కష్టములు, అవమానములు నిందలు దుఃఖములు వచ్చినప్పుడు కృంగిపోకుండాను వుండునదియే ఆధ్యాత్మిక ధైర్యము అటువంటి వారి యింట జననమైన మరణమైనను సమానముగా నుండును. ఇటువంటిదే ద్వంధ్వముల నతిక్రమించు స్థితి. ఇట్టి స్థితి గొప్ప గొప్ప పండితులకైనను సద్గురుని చేరక కర్తృత్వము వదలనివారికి అసాధ్యము. అటువంటి స్థితి గలిగిన పిమ్మట తాను కర్తృత్వరహితుడై అండపిండ బ్రహ్మాండమంతటుములుగృచ్ఛు సందులేక పిపీలకాది బ్రహ్మ పర్యంతము ఆదిమధ్యాంతరహితుడై నిత్యానంద రహితుడై జనన మరణరహితుడై నిత్యజీవముతో నుండును. అటువంటి రాజయోగి యొక్క మూలములేని గుర్తెరగే శరీరమునకు పుట్టినరోజు వేడుకలు షష్టిపూర్తి వేడుకలు గాని మరణమందు, అంత్యక్రియల సందర్భముగా కర్మకాండము లన్నియు నెరపుట, మైలు అనే ఆచారములుండవు. ఆ విధముగా దేహభ్రాంతి, లోకభ్రాంతి దైవ భ్రాంతి నశించి మోక్ష భ్రాంతికూడా నశించు ను. అదే మోక్షసన్యాసము.

**ఉదా: యోగవాసిష్టం (వసిష్ఠగీత) 5వ అధ్యాయము చిత్తచికిత్స**

102 శ్లో॥ పుమాన్మృతోఽస్మిజాతోఽస్మి జీవామీతికుదృష్టయః
చేతసో వృత్తయోభాన్తిచపల స్యాసదుత్థితాః

తా॥ నేను పురుషుడను నేను మరణించితిని నేను పుట్టితిని నేను జీవించు చున్నానను ఈ మున్నగు దోషదృష్టులన్నియు చపల చిత్తము యొక్క వృత్తులేయగుచు అసత్య రూపమునే ప్రాదుర్భవించి బాసించుచున్నదగును.

**మరియొక ఉదా: యోగవాసిష్టము (వసిష్ఠగీత) 2వ అధ్యాయము ఉత్పత్తి ప్రకరణము లీలోప్రాఖ్యానము.**

**సర్వశాస్త్రార్థ సంగ్రహము.**

101 శ్లో॥ కర్మైవ దేహోనను దేహఏవ
చిత్తం తదేవాహ మితీవా జీవః
స జీవ ఏవేశ్వర చిత్స ఆత్మా
సర్వః శివస్త్వేక పదోక్తమేతత్

తా॥రామచంద్రా (కర్మానుసారముగ దేహము యేర్పడుటవలన) కర్మమే

దేహము ఆ దేహమే చిత్తము ఆ చిత్తమే జీవుడు ఆ జీవుడే సర్వరూపమై శివ (మంగళ) స్వరూపమై చిద్రూపమైనట్టి ఆత్మయు ఈశ్వరుడునైయున్నాడు ఈ ప్రకారముగ సకల శాస్త్ర రహస్యమును ఒక్కమాటలో నీకు చెప్పివైచితిని.

ఈ బ్రహ్మ విద్యారహస్యము నెరుగని పండితులు శరీరపేడుకలు అనగా పుట్టిన రోజు షష్టి పూర్తియు॥ మూఢాచారములు పామరులవలె జరుపుదురు.

దేహభ్రాంతి నశించినదా లేదా అని తెలిసికొనుటకు.

**ఉదా : భగవద్గీత 4వ అధ్యాయము జ్ఞాన యోగము.**

**35**వ శ్లో॥ యజ్ఞాత్వానపునర్మోహమేవం యాస్యసిపాణ్డవ
యేన భూతాన్య శేషేణ ద్రక్ష్య స్యాత్మన్యథో మయి॥

తా॥ ఓ అర్జునా! దేనిని తెలిసికొనినచో మరల నిట్టి మోహమును నీవు పొందకుందువో మరియు దేనిచే సమస్తప్రాణులను నీయందును నాయందును గూడ చూడగలవో అట్టి జ్ఞానమును తత్త్వవేత్తల వలన తెలిసికొనుము.

వ్యాఖ్య : జ్ఞానమును పొందుట వలన రెండు ఫలితములు కలుగును. 1. అంతవరకు ఉన్నట్టి మోహము అజ్ఞానము (అవిద్య) నశించును, 2. సమస్త ప్రాణికోట్లను తనయందును గురునియందును చూడగలుగును ఈ రెండింటిని గూర్చి విచారించెదము.

కండ్లున్నదానికిగుర్తు గోతిలో పడకుండుటయే. ఎవరైనా గోతిలో పడినచో అతనికి కండ్లులేవని అర్థము. అట్లే జ్ఞానము పొందినవానికి గుర్తు మరల పూర్వములె మోహమును పొందకుండుటయే. దృక్ స్వరూపమగు ఆత్మయొక్కటియే సత్యము. తక్కిన దృశ్యపదార్థములన్నియు అసత్యములు అని తెలిసికొనుటయే జ్ఞానము. అట్టి జ్ఞానము కలిగిన వారికి మరల దృశ్యవస్తువులను గూర్చియేల శోకమును మోహమును పొందును?

మామిడి పచ్చికాయ ఎచట చూచినను, వగరుగ పులుపుగనుండును. పక్వమైన పిదప ఎచటచూచినను తీపిగనే దానిరుచి కలిగియుండును పూర్వపు వగరు, పులుపుదనము దానికి ఏమాత్రము ఉండవు. ఒకవేళ అవి వగరుగాని, పులుపుగాని కలిగి ఉన్నచో అది సరిగా పక్వము కాలేదని అర్థము అట్లే గురూపదేశము తీసుకున్న శిష్యుడు సాధన చతుష్టయ సంపత్తిని అభ్యాసముచేసి బ్రహ్మజ్ఞానము పొందిన శిష్యుడు. గురునియందు తైలధారవంటి నమ్మిక

భక్తికలిగి. తను ధన మాన ప్రాణములర్పించినట్లు మనసా వాచా కర్మణా ధృడపడి, బ్రహ్మజ్ఞానము పొందిన శిష్యునకు అహంకారము పోనట్లయిన పైన చెప్పిన విషయములు త్రికరణశుద్ధిగా ఆచరించ లేదని, తనకు ఇంకా బ్రహ్మజ్ఞానముశిద్దించలేదని అర్థము. అట్టి బ్రహ్మజ్ఞానము పొందినవారు సమస్త ప్రాణికోట్లను తనయందును పరమాత్మ యందును చూడగలరు. ఈ బ్రహ్మాండమంతయు ఈ చరాచర జగత్తంతయు ఆత్మయందు కల్పింపబడినది.

రజ్జుసర్పభ్రాంతి : సర్పమెచటనున్నది? రజ్జువునందే. స్వప్నమెచటనున్నది? మేలుకొనిన వానియందే. అనగా రజ్జువును చీకటిలో చూచినప్పుడు సర్పమువలె తోచినది. అది అజ్ఞానమువలనగదా అప్పుడు దీపపు సహాయమున చూచిన యెడల సర్పభ్రాంతి పోయి రజ్జువు కనబడినదిగదా! అట్లే తన యదార్థ బ్రహ్మ స్వరూపము అవిద్యవలన (అజ్ఞానమువలన) తన దేహమే యదార్థమని యెంచిన వానికి సద్గురువు సహాయమున తన యదార్థస్థితి పరబ్రహ్మ స్వరూపమని తెలిసినందువలన తన దేహ భ్రాంతి నశించును. అట్లే స్వప్నములో గలిగిన కష్టసుఖములు అన్నియు మెలకువలో మాయమగును. స్వప్నములో పొందిన వస్తువులు మెలకువలో కనబడవు నిద్రలో కలగన్నప్పుడు మేలుకొన్న వానికి కలయొక్క వృత్తాంతము నిజముకాదని తెలియును కాని వేరొకరికి తెలియదు. శరీరము ప్రపంచములో జన్మించినపుడు ఏమీ తనకూడా రావు పుట్టిన తర్వాత యౌవ్వన, కౌమార వృద్ధాప్యముల వరకు సంపాదించిన స్థిర చరాస్తులు మరణించినపుడు తనకూడా తీసుకొని వెళ్ళలేదు అనగా స్వప్నమునకును ప్రపంచములోని జీవితమునకు తేడా ఏమీలేదు అని గ్రహించవలెను.

**ఉదా॥ : యోగవాసిష్ఠము (వసిష్ఠగీత) ఉత్పత్తిప్రకరణము, వాసనాక్షయము ౨వ అధ్యాయము**

**39**వ శ్లో॥ యధా స్వప్న పరిజ్ఞానాత్స్వప్న దేహోనవాస్తవః
అనుభూతోఽప్యయం తద్వద్వాసనా తానవాదసన్

తా॥ స్వప్నము యొక్క పరిజ్ఞానము కలిగిన మీదట స్వప్న దేహము వాస్తవము కానట్లు వాసనలు సన్నగిలిన పిమ్మట ఈ ప్రపంచము అనుభూతమైనప్పటికినీ అసత్యము (మిథ్య)గనే తోచును.

**మరియు అదే అధ్యాయము.**

**40**వ శ్లో॥ యథా స్వప్నపరిజ్ఞానాత్స్వప్నదేహః ప్రశామ్యతి॥
వాసనా తానవాత్తద్వ జ్జాగ్రద్దేహోఽపి శామ్యతి.

తా॥ స్వప్నము యొక్క పరిజ్ఞానముచే స్వప్నదేహము శమించునట్లు వాసనలు సన్నగిల జాగ్రద్దేహమును శ్రమించిపోవును మిధ్యగాతోచును.

**మరియొక వసిష్టగీతఉదా: ఉత్పత్తిప్రకరణము, లీలోపాఖ్యానము ౨వ అధ్యాయము.**

**32.** శ్లో॥ అవిచారో విచారేణ నిమేషాదేవ నశ్యతి।
ఏషా సత్తైవ తేనా న్తర విద్యైషా న విద్యతే॥

తా॥ అవిద్య, విచారణచే ఒక్క నిమిషములో నశించిపోవును ఆ పిమ్మట కేవలము బ్రహ్మ సత్తాయే శేషించును అటు అవిద్యయుండనే ఉండదు.

# యోగవాసిష్టము

ద్వాపరయుగములో భగవద్గీత యందు శ్రీకృష్ణుడు అర్జుననుకు పదేశించిన విధముగానే త్రేతాయుగమున యోగవాసిష్టమున చెప్పబడినట్లు వశిష్ఠుడు శ్రీరామ చంద్రునకు తత్త్వోపదేశము చేసినాడు. భగవద్గీత యోగవాసిష్టములు రెండునూ సంవాదరూపముగ నున్నవి. అర్జునుడు ప్రాపంచిక ఐశ్వర్యములయందు విరక్తి కలిగి త్రైలోక్య సామ్రాజ్యము కూడా తృణప్రాయముగ నెంచి కింకర్తవ్యమూఢుడై రణరంగమున నున్నపుడు అతనికి శ్రీకృష్ణుడు గీత ధర్మములను ఎట్లు బోధించెనో అట్లే పదునారేండ్ల వయసులో శ్రీరామచంద్రుడు దృశ్యప్రపంచము యొక్క అనిత్యమును గ్రహించి భోగవిలాసముల ఎడల పూర్తిగా విరక్తి కలిగి కర్తవ్యము తెలియక ఉదాసీనుడైయున్న సమయమున వారి కులగురువైన వశిష్ట మునీంద్రులు వారికి ధైర్యము చెప్పి ఉత్సాహపరచి " యోగవాసిష్టమను తత్త్వ బోధను గావించిరి. ఆబోధ **20** రోజులు సాగినది. దానిని వాల్మీకి మహర్షి,సిద్ధులు, తుంబుర నారదాదులు వినియున్నారు. ఆబోధ పూర్తి అయిన తరువాత విశ్వామిత్రుడు లేచి ఆ నిండు సభలో ఇట్లుపలికెను. (వసిష్టగీత)

శ్లో॥ అహోబత మహత్పుణ్యాం శ్రుతం జ్ఞాతం మునేర్ముఖాత్
యేన గఙ్గా సహస్రేణ స్నాతా ఇవ పయంస్థితా ।

తా॥ అహా! ఎంత సంతోషము! మహాపుణ్యా స్వరూపమై అత్యంత పవిత్రమైనట్టి జ్ఞానమును వసిష్టమునీంద్రుని ముఖతః ఇపుడు వినగలిగితిమి. దానిచే వేలకొలది గంగానదులందు స్నానముచేసిన చందమున మనమిపుడు మహాపవిత్రులమై యలరారుచున్నాము, " చూచితిరా! విశ్వామిత్రుని ఆనందాతిశయము! ఒకానొకప్పుడు కామధేనువు విషయములో వసిష్టునకు పరమ శత్రువుగా ఉండున ట్టి విశ్వామిత్రుడే యిట్టి ఉదాత్తమయిన అభిప్రాయమును వెలిబుచ్చ ఇక ఆబోధ యొక్క విలువలు యేమని చెప్పవచ్చును. పోనిండు త్రిలోక సంచారియైన నారదుడేమి సెలమిచ్చెనో చూడుడు.

శ్లో॥ యన్నశ్రుతం బ్రహ్మలోకే స్వర్గే భూమితలే తథా
కర్ణౌ తజ్జ్ఞాన మాకర్ణ్య యాతౌమే ఉ ద్య పవిత్ర తామ్

తా॥ దేనిని బ్రహ్మలోకమునగాని స్వర్గలోకమునగాని, భూతలమునగాని, ఇంతవరకు నేను వినియుండలేదో అట్టి మహాబోధను ఇపుడు విని నాచెవులు రెండును పవిత్రములైపోయినవి!"

త్రిలోక సంచారి కనుక నారదునకు తటస్థపడునంత మంది మహాత్ములు మరెవరికిని తటస్థపడరు. అనేక మతములు, అనేక ఆశ్రమములు, అనేక సంఘములు అనేక సభలు, అనేక బోధలు చవిచూచియుండిన మహావ్యక్తి యాతడు. అట్టి నారదుడే పైనదెల్పిన భావములను వ్యక్తీకరింప ఇక వసిష్ఠుల జ్ఞాన బోధయెట్టిదో మనము ఊహించుకొనవచ్చును. ఆ సభకెరుదెంచిన సిద్ధులిట్లు వచించిరి.

శ్లో॥ ఆకల్పం సిద్ధ సంఘేషు మోక్షపాయాః సహస్రశః।
వ్యాఖ్యాతాశ్చ శ్రుతాశ్చాల మీదృశాస్తు న కేచన.

తా॥ "కల్పాంతరము నుండి సిద్ధ సంఘములందు మేము మోక్షోపాయముల గూర్చిన వేల కొలది గ్రంధములను వింటిమి. వ్యాఖ్యాన మొనర్చితిమి. కాని వసిష్ఠుల బోధవంటి ఉత్తమ బోధను మేమెన్నడునూ ఎచటను వినియుండ లేదు," బోధకుని యొక్కయు బోధయొక్కయు మహిమను నిరూపించుటకు శ్రోతల యొక్క ఈ వాక్యములే చాలును.

ప్రారంభముననే వసిష్ఠులు శాస్త్రానుకూలమగు పురుష ప్రయత్నము యొక్క ఆవస్యకతను గూర్చి పలుతెరగుల బోధించిరి. గత దినమందలి అజీర్ణాది దోషములు నేటి ఔషదాధి గుణములచే క్షయించులాగున ఈ జన్మయందలి శుభపురుష ప్రయత్నవుచే పూర్వజన్మపు అశుభపురుష ప్రయత్నము నిస్సందేహముగ శమించి పోవునని నుడివిరి.

**మరియు (వసిష్ఠగీత ముముక్షుప్రకరణము)**

శ్లో॥ సంసారకుహరాద స్మాన్నిర్గన్తవ్యం స్వయం బలాత్
పౌరుషం యత్న మాశ్రిత్య హరణే వారి పంజరాత్.

తా॥ "ఉత్తమ పురుష ప్రయత్నము నాశ్రయించి ఈ సంసారమను గోతినుండి శత్రు పంజరము నుండి సింహామువలె స్వయముగ బలాత్కారముగ బయల్వెడలవలెను." అనియు శ్రీ వసిష్ఠులు ముముక్షప్రకరణమున శ్రీరామచంద్రునకు బోధించిరి. విశ్వామిత్రుడు తన యొక్క తీవ్ర

ప్రయత్నాము వలననే బ్రహ్మర్షికాగల్గెను. భగీరథుడు తన యొక్క ప్రయత్నాతిశయము వలననే గంగను భులోకమునకు రప్పించగల్గెను. బుద్ధదేవుడు తనయొక్క అకుంఠిత ప్రయత్నము యొక్క ప్రాబల్యము చేతనే, నిర్వాణమను లక్ష్యమును ఈ జీవితమందే చేరగల్గెను. ఈ ప్రకారముగ ఎందరో ఋషులు మునులు మహనీయులు తమ యొక్క పురుషప్రయత్నము యొక్క మహిమచే లక్ష్యమగు పరమాత్మను బొందగలిగిరి. కావున మెరపువలె చంచలమైనట్టి ఈ సంసారమును బొందిన మనుజుడు సచ్ఛాస్త్ర, సాధుజన సాంగత్యములచే అజ్ఞానమను బురదనుండి సారవస్తువగు ఆత్మను ఉద్ధరింపవలెను. వార్ధక్యము రాకమునుపే బాల్య, యౌవనము లందే ఈ సంసారమను మహాసముద్రము ను విశుద్ధ బుద్ధియను నావచే దాటివేయవలెను. ఏది శ్రేయమో దానిని ఇప్పుడే ఆచరించవలెను. వృద్ధుడైన పిదప మనుజుడేమి చేయగలడు అత్తరి అతని సొంత అవయవములు కూడా అతనికి భారభూతములుగ తోచును. ఆత్మజ్ఞానార్థము దృఢ ప్రయత్నము గావించినచో తనకు తానే బంధువగును, అట్లు కాకున్న తనకు తానే శత్రువగును ఈవిధముగ వివేకాదుల ద్వారా పురుష ప్రయత్నముచే తన్నుతాను ఉద్ధరించుకొనినచో ఇక తన యొక్క రక్షణ మందు వేరు ఉపాయమేదియునులేదు.

కాబట్టి మహాకష్ట పరిస్థితులు సంప్రాప్తించినప్పటికిని కూడా మనుజులు సాధుజన సాంగత్యమును ఒక్కింతైన వదలరాదు. మరియు దరిద్రుడు మణులను వెతకునట్లు పరమాత్మయందు విశ్రాంతి నొందిన మనస్సు గలవారును ధన్యులునైన సాధుమహాత్ములను ప్రయత్ని పూర్వకముగా వెతికి సేవింపవలెను.

ఈవిధముగా సజ్జన సాంగత్యము నలవరచుకొని అమ్మహనీయుల ముఖత పరమార్థబోధను శ్రవణముచేయుచు శమదమాది సద్గుణములను మొట్టమొదట సంపాదించవలెను. వానిచే చిత్తము శుద్ధమగును. అని బోధించిరి. ఆబోధను వాల్మికి "యోగవాసిష్ట "మను గ్రంధముగా రచించినాడు. ఆబోధ యొక్క ప్రభావము శ్రీరామునిపై ఎట్లుచూపినది గమనింపుడు. శ్రీరామునికి పట్టాభిషేక మహోత్సవమునకు ముహూర్తమును వశిష్టుల వారు నిర్ణయించి నారు. ఆరోజు రానే వచ్చినది. శ్రీరామునికి మంగళస్నానములు చేయించి వస్త్రాభరణములతో అలంకరించిరి.

ఆసమయమున పినతల్లి కైకేయి జ్ఞాపకమునకు వచ్చినది. అనగా తనను చిన్నప్పటి నుండి తల్లికంటె మిక్కిలి ప్రేమతో చూచిన పిన తల్లి కైకేయి ఆశీర్వాదమును పొందవలెనని రాముడు వెళ్ళినాడు.

ఆసమయమున తండ్రి దశరధుడు నేలపై స్పృహ తప్పి పడియున్నాడు. అది చూచిన శ్రీరాముడు నిర్ఘాంతపోయి "అమ్మానాన్నగారు యిలా పడియున్నారేమి" అని కైకేయిని రాముడడగగా మీనాన్నగారు నాకు యిచ్చిన వరముల ప్రకారము ప్రస్తుతము పట్టాభిషేకము భరతునికేగాని నీకుకాదు. నీవు పదునాలుగేండ్లు వనవాసము చేయవలసియున్నందున ఆయన ఆవిషయును తట్టుకొనలేక స్పృహతప్పినారని కైకేయి చెప్పినది. పితృవాక్యపరిపాలన కొరకు కైకేయి వద్ద సెలవు తీసుకొని ఆనందముగా తన అలంకరణములను తొలగించుకొని నారవస్త్రములను ధరించి కోదండమును చేత బట్టి అరణ్యమునకు బయలుదేరెను. ఆయన వెంట సీత లక్ష్మణులు బయలుదేరినారు. అటువంటి దృఢమయిన మనసు కలగడానికి గల కారణము యోగవాసిష్టము అనే వసిష్టగీత యొక్క ప్రభావమే గదా! త్రేతాయుగమున వాల్మీకి మహర్షి యోగవాసిష్టమున **32** వేల శ్లోకములతో (ఈవసిష్టగీతను మహాగ్రంధముగా రచించెను. భగవద్గీతకు దానికి ఈక్రింది పోలికలుగలవు. భగవద్గీతయందు శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశించిన విధముగా యోగవాసిష్టమున వసిష్టుడు శ్రీరామచంద్రునకు తత్త్వోపదేశము చేసిరి.

అవిద్యతొలిగిన వానికి పట్టాభిషేకమయినా **14** సంవత్సరములు వనవాసమైనా సమానమేకాని అవిద్యతొలగనివారి పరిస్థితి గమనించుటకు ఉదా: ప్రస్తుత అసెంబ్లి సభలో ముఖ్యమంత్రి పదవిగాని పార్లమెంటు సభలో ప్రధానమంత్రి పదవిగాని లభించి ప్రమాణ స్వీకారమునకు వెళ్ళినపుడు ఆపదవినీకు కాదు మరియొకరికి యివ్వడం జరిగినదని ఆసభలోని వారంటే అప్పటికనప్పుడు అల్లకల్లోలం జరిగి మైకులు విరిగి పోవడం బల్లలు పగిలిపోవడం జరగదా? అటువంటి వుదాహరణలు లోగడ కూడా వున్నవి. దానినే అవిద్య అంటారు. బ్రహ్మవిద్య ప్రభావము వల్లనే అవిద్యతొలగిన శ్రీరాముడు తండ్రి యాజ్ఞకు బద్ధుడై పట్టాభిషేక మహోత్సమును తృణ ప్రాయముగా తలచినాడు. అదే అతీతమయిన స్థితి. అందు చేతనే శ్రీరాముని

స్థితి "బాలోన్మత్త పిశాచరీతి "గ నుండునని అన్నారు పెద్దలు. అనగా బ్రహ్మవిద్యను నేర్చిన ప్రతివారి స్థితి ఇట్లేయుండును.

యోగవాసిష్టము త్రేతాయుగము నాటిది. భగవద్గీత ద్వాపరయుగము నాటిది అనగా రెండు యుగములధ్యకాలము అయినను బ్రహ్మవిద్య సద్గురువుల బోధామృతసారము. ఇది సద్గురు పరంపరగా యెన్నియో యుగముల నుండి వచ్చుచున్నది.

దీనిని మొదట మహావిష్ణువు సూర్యునికి, సూర్యుడు యాజ్ఞవల్క్యునకును, యాజ్ఞవల్క్యుడు జనక చక్రవర్తికి చెప్పగా అజనక చక్రవర్తికి యాజ్ఞవల్క్యుని వలన ఈబోధ సిద్దించలేదు. యెందరో గురువులను చూచి చూచి చివరకు అష్టావక్రుని వలన బ్రహ్మవిద్య సిద్దించినది. ఆతరువాత జనకుడుశుకునికి, శుకమహర్షి సాందీప మహర్షికి, సాందీపుడు శ్రీకృష్ణునకు, శ్రీకృష్ణుడు అర్జునునికి, వుద్దవునకు బ్రహ్మవిద్య ద్వాపర యుగాంతము వరకు సాగినది. తరవాత కొంతకాలము వరకు వివరములు తెలియవు. ఆతరవాత శ్రీధరస్వామికి ఆయన వలన శివరామ దీక్షితులకు దొరికినది.

శ్రీ శివరామ దీక్షితలవారు సగుణారాధనతో 100 యజ్ఞములను చేసినట్లును ఆయజ్ఞఫలము వలన స్వర్గలోక ప్రాప్తి జరుగునని ఆపుణ్యఫలితము క్షీణించిన తరవాత తిరిగి భూలోకమందు జన్మించవలసినదేనని బ్రహ్మవిద్యవలన జన్మరాహిత్యమగునని తెలుసుకొని దీనికొరకు అన్వేషించగా శ్రీ శ్రీధరస్వాముల వారి వలన శ్రీశివరామ ధీక్షితుల వారికి ఈబ్రహ్మవిద్య లభించినది. వారివలన ఈ బ్రహ్మవిద్యను తెలుసుకొని ఆచరించి శిష్యులకు యీ విద్యను అచలసాంప్రదాయము అను పేరుతో బోధించి ప్రచారముచేసిరి. అచలమనగా పరబ్రహ్మ స్వరూపము అండపిండ బ్రహ్మాండమంతటా పిపీలకాది బ్రహ్మపర్యంతము ములుగ్రుచ్చుసందు లేక నిండి త్రిగుణ రహితమై శబ్దస్పర్శరూపరస గంధములేక కర్తృత్వ రహితమై చలనము లేకవున్నది. అందుచేతనే దీనిని అచలమనిరి. ఆవిధముగా శిష్యపరంపరగా వచ్చిన ఈవిద్య యేనుగువానిలంక వాస్తవ్యులైన సద్గురు శ్రీ గంగిపాముల శ్రీరామచంద్ర యోగీంద్రులవారి వలన నాకు లభ్యమైనది. (అనగా రచయితకు)

ఈబ్రహ్మవిద్య శ్రీగురుదేవుని సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపునిగా తలచి

అహంరహిత మొనర్చుకున్న వారికి అతి సులభమైనది గాను శ్రద్ధలేనివారికి అతి కష్టమైనదిగాను యెన్ని జన్మలకైనను సిద్ధించని స్థితి యేర్పడును.

మానవుడు తరించుటకు అనగా జన్మరాహిత్యమును చెందుటకు అహంరహితమే ముఖ్యసాధనము. అది పరమగురువు అను సద్గురువుల చేతనే సాధ్యమని ఇంతవరకు తెలుసుకున్నాము.

**ఉదహరణ వశిష్ట గీత (యోగవాసిష్టము) మోక్షసాధన, 3వ అధ్యాయము.**

2. శ్లో॥ సంసారోత్తరణే జన్తో రుపాయోజ్ఞానమేవ హి
తపోదానం తధా తీర్థమనుపాయాః ప్రకీర్తితాః ॥

తా॥ జీవుడు సంసారమును తరించుటకు జ్ఞానమే ఉపాయము. తపోదాన, తీర్థాదులు ఉపాయములు కావని చెప్పబడినవి (అవిసాక్షాత్సాధనలు కావనియు పరంపరాసాధనములేయనియు గ్రహించునది.)

**ఉదాహరణ వసిష్టగీత పై అధ్యాయముననే.**

3. శ్లో॥ రాజవిద్య రాజగుహ్యా మద్యాత్మజ్ఞాన ముత్తమమ్
జ్ఞాత్వా రాఘవ రాజానః పరాం నిర్దుఃఖతాం గతాః

తా॥ రాజవిద్య అనబడిన ఈ వుత్తమమైన మహారహస్యమైన ఆద్యాత్మ జ్ఞానమును పూర్వము రాజు లెరిగి పూర్ణముగా దుఃఖరాహిత్యమునుబొందిరి.

**పై అధ్యాయముననే (మోక్షసాధన) వశిష్ట ఉవాచ**

1. శ్లో॥ నిర్వాణం నామ పరమం సుఖం పునర్జన్మః
నజాయతే నమ్రియతే తజ్ఞానా దేవ లభ్యతే ॥

తా॥ ఓ రామచంద్రా! దేనిచే జీవుడు మరల ఈ సంసారమున జన్మించడో మరణంచడో అట్టి పరమసుఖమే నిర్వాణము (మోక్షము) అది కేవలము జ్ఞానము చేతనే లభించును. ఆజ్ఞానము సద్గురుని వల్లనే సాధ్యము.

**ఉ॥ వసిష్ట గీత - శమము (మనశ్శాంతి)**

5. శ్లో॥ త్రైలోక్యోదర వర్తిన్యో నానన్దాయ తధాశ్రియః ।
సామ్రాజ్య సంపత్ప్రతిమా యధా శమ విభూతయః

తా॥ ముల్లోకములందున్న సంపదలలో నేదియు గూడ సామ్రాజ్య సంపత్తిని బోలు శమము (మనశ్శాంతి) అను ఐశ్వర్యముతో సమానముగ ఆనందము నీయజాలవు. అందుచేత

అదే అధ్యాయము.

14. శ్లో॥ శృత్వా స్పృష్ట్వా చదృష్ట్వా చభుక్త్వాఘ్రాత్వా శుభాశుభమ్
నహృష్యతి గ్లాయతియః సశాన్త ఇతి కథ్యతే॥

తా॥ శుభమైనట్టిగాని, అశుభమైనట్టిగాని , పదార్థములను వినినపుడుగాని, తాకినపుడుగాని , చూచినపుడు గాని, తినినపుడుగాని, వాసన చూచినపుడు గాని ఎవడు సంతోషమునుగాని, దుఃఖమునుగాని,ఎవడు పొందకుండునో అతడే శాంతుడని, నిత్యానందుడని, (శమయుక్తుడని) చెప్పబడును.

**వసిష్ఠ ఉవాచ(శమము) ముముక్షు వ్యవహార ప్రకరణము (సత్సాంగత్యము)**

69. శ్లో॥ దారిద్ర్యం మరణం, దుఃఖమితాది విషయో భ్రమః
సంప్ర శామ్యత్య శేషేణ సాధుసంగమ భేషజైః

తా॥ దారిద్ర్యము, మరణము దుఃఖము మున్నగువాని తో కూడిన సంసారము భ్రమయను రోగము. సాధుజన సాంగత్యమను ఔషధములచే సంపూర్ణముగా (సమూలముగ) నశించిపోవును.

**వసిష్ఠగీత (శమము) అదే అధ్యాయము.**

70. శ్లో॥ సంతోష సాధుసఙ్గశ్చవిచారోఽథ శమస్తథా
ఏత ఏవ భవామ్భోధావుపాయా స్తరణే నృణామ్।

తా॥ సంతుష్టి సాధుజన సాంగత్యము, విచారణ, శమము అను ఈనాలుగే సంసార సముద్రమును దాటుటకు మనుజులకు ఉపాయములైయున్నవి. ఈనాల్గింటిలో ఏఒక్కదానినైనను సాధించిన తక్కినవి వాటంతట అవియే శిద్ధించును.

**వసిష్ఠగీత చిత్తచికిత్సావర్ణనము (ఉత్పత్తి ప్రకరణము).**

90. శ్లో॥ మనోమారణ మాత్రేణ సాధ్యేన స్వాత్మ సంవిదా
నిస్సపత్న మనాద్యన్త మనిజ్జనమి హోచ్యతామ్॥

తా॥ మనస్సు యొక్క మారణ మాత్రము సాధ్యమగు స్వాత్మతత్త్వ సాక్షాత్కారముచే మోహాది శత్రురహితమై అచలమై ఆద్యంత రహితమైనట్టి స్వారాజ్యమును బొందుటకై ఈజన్మయందే ప్రతిజ్ఞ యొనర్పబడుగాక.

పార్వతికి మహేశ్వరుడు చెప్పిన ఆఖరివిషయం

**గురుగీత**

**22.** శ్లో॥ వేద శాస్త్ర పురాణాని చేతిహాసాది కాని చ
మన్త్ర యన్త్రాది విద్యాశ్చ మోహనోచ్చాట నాదికమ్

**23.** శ్లో॥ శైవ శాక్తాగ మాదీని హ్యన్యేచ బహవో మతాః।
అపభ్రంశాస్స మస్తానాం జీవానాం భ్రాన్త చేత సామ్॥

తా॥ ఋగాది చతుర్వేదములును, శిక్షావ్యాకరణాది షట్శాస్త్రములును, పద్మస్కాందాది అష్టాదశ పురాణములును, భాగవత భారతాది ఇతిహాసాదులును, మంత్రయంత్ర తంత్రాది విద్యలును, 1. మోహన, 2. ఉచ్చాటన 3. వశీకరణ, 4. మోహన (మూర్ఛన) , 5. స్తంభన, 6. మారణములను షట్క్రియులును, శైవశాక్తాగ మాదులును, మరియు నితరములగు సాంఖ్యయోగాది మతములను ఇవన్నియు శ్రీగురుదేవుని యందు భక్తిలేక గరుతత్త్వము నెరుంగని భ్రమమతిగల జనులందరికిని అపభ్రంశములగు చున్నవి. అనగా విరుద్దార్ధము నిచ్చుచు దుష్టములై వారికి తత్త్వమును తెలియుటను ప్రయోజనమును గలుగ జేయనివగు చున్నవి. శ్రీ గురు భక్తిలేని వారికి సమస్త శాస్త్రార్థములును వ్యర్థములని భావము.

**అష్టావక్ర గీత, నాల్గవ ప్రకరణము**

**శ్రీ శుకబ్రహ్మర్షి యిట్లు చెప్పచున్నాడు:-**

6. శ్లో॥ భేదా భేదౌసపది గళితౌ పుణ్య పాపే విశీర్ణే।
మాయామోహౌక్షయము వగతౌ నష్ట సందేహ వృత్తేః
శబ్దాతీతం త్రిగుణ రహితం ప్రాప్య తత్త్వావ బోధం
నిస్త్రైగుణ్యే వధి విచారతాం కో విధిఃకో నిషేదః॥

తా॥ అనగా బ్రహ్మజ్ఞానికి ఆత్మజ్ఞాన ప్రభావము వలన భేదము అభేదము యీ రెండువృత్తులు శీఘ్రముగా నశించి అతనికి పుణ్యపాపములు నష్టమగుచున్నవి. ఎవనికి మాయ మాయా కార్యమగు మోహము యీరెండునూ నశించి పోయినవో ఎవడు శబ్దాది విషయులనుండి, మూడు గుణముల నుండి రహితుడో ఎవడు అత్మ తత్త్వమును పొందినవాడో మరియు నెవడు త్రిగుణ రహితుడై నిర్గుణ బ్రహ్మ మార్గమునందు చరించుచున్నాడో అట్టివానికొక విధియు లేదు నిషేధము లేదు.

**18వ ప్రకరణము అష్టావక్రగీత.**

69ఎ. శ్లో॥ "వాచారంభణం వికారో నామధేయం
మృత్తికే త్యేవ సత్యమి " తిశృతేః ॥

తా॥ కడవలు, మూకుళ్ళు, ముంతలు మొదలగున వెన్ని రూపనామములతో నెంచబడినను అవన్నియు మట్టినుండియే కలిగినవి కావున మట్టియే సత్యము. ఇవన్నియునూ అశ్వరములును అసత్యములునైయున్నట్లు మహదాద్యహం కార కృత సమస్త ప్రపంచమును మిథ్యయే. తదధిష్టాన మగు బ్రహ్మ మొక్కటియే సత్యము ఇట్టి విచార జ్ఞానముతో ఈసంపూర్ణ జగత్తు కల్పితమనియు, తదదిష్టాన మొక్కటియే సత్యమనియు తెలిసికొన్న జ్ఞాని. కేవల శుద్ధ చైతన్య స్వరూపుడై యుంటున్నాడు. అతనికి చేయవలసినదేదియు మిగిలియుండదు.

**అష్టావక్రగీత 18వ ప్రకరణము.**

70. శ్లో॥ భ్రమభూతమిదం సర్వం కించిన్నా స్తీతి నిశ్చయీ
అలక్ష్య స్ఫురణః శుద్ధః స్వభావేనైవ శామ్యతి ॥

తా॥ అధిష్టాన బ్రహ్మ సాక్షాత్కారము గలిగిన జ్ఞానికి యీజగత్తంతయు కల్పితమని ప్రతీతమగును. వాస్తవముగా ప్రపంచ సంబంధమగు ఏవస్తువుగూడ సత్యమైనదని అతడు తలంచడు. ఎవనికి ఇట్టి జ్ఞానము కలిగినదో అట్టివాడు శాంతికొరకు ప్రయత్నమును చేయడు. ఎందుకనగా అతడు స్వాభావికముగనే శాంత స్వరూపుడై యున్నాడు. మరల శాంతికొరకు అతడు చేయదగి నదేదియు నుండదు.



# సద్గురుని దివ్యబోధ

దీనిని సద్గురువర్యుడు స్వయముగా చెప్పినట్లు ఊహించవలెను.

నాయినా నీవు నీ తనుధనమానప్రాణములను ఉపదేశకాలమున నీ సద్గురునికి ధారవోసితివి. అపుడు శబ్దస్పర్శరూప రస గంధములు లేని యధార్థస్వరూపమే నీవు. అట్టినీకును నీగురువునైన నాకును శబ్ద స్పర్శ రూప రస గంధములు లేవు మరియు ప్రాణవాయువు కోరికలైన ఆకలి, దాహము, మనస్సు యొక్క స్వభావమైన శోకము, మోహము, శరీర ధర్మములైన పుట్టుట గిట్టుట అనునవి ఆరును వరుసగా **1.** ఆకలి, **2.** దాహము, **3.** శోకము, **4.** మోహము, **5.** పుట్టుట, **6.** గిట్టుట అను ఈ ఆరును షడూర్ములందురు. ఇవి మనసుకు లేవు. ఇవి ప్రపంచమందు గల మాయ యొక్క తిప్పలు నీవు యీ రాజయోగ ప్రభావము వలన కర్తృత్వ రహితుడవై శబ్దస్పర్శ రూప రస గంధములు లేని వాడవై ప్రపంచమంతట నిండి ములుగుచ్చు సందు లేక యుంటివి. నీకు శరీర ధర్మములు శరీరపాట్లు లేవు. అపుడు ద్వంద్వాద్వంద్వముల కతీతమైన గుర్తు రహితమనే తెలివి రహితుడవైయున్నావు. అదే నీయదార్థమైన స్థితి అదే ఆదిమధ్యాంత రహితమైనది ఏకాత్మన్నా దైవమన్నా, అచలమన్నా ఇదే బ్రహ్మ విద్యా సారాంశము ఈస్థితి త్రికరణ శుద్ధిగా సద్గురునికి సేవ చేయని వారికి ఎన్ని జన్మలెత్తినా అర్థంకాదు. కర్తృత్వం పోదు, ఆస్థితి దొరకదు, నీవు రాజమార్గమందున్నప్పటికీ నీసంసారమందు జరపవలసిన పనులు సామాన్యుని వలెనే జరుపుకొనవలెను ఎందుచేతననగా నీవు స్వదృష్టియందు అందరిలోను నేనున్నాననిగాని లేననిగాని నీవు వేరే ఇంకొకరున్నారని గాని లేనట్లుగాని తోచుటగాని తోచకపోవుటగాని లేదు.

పంచభూతములవలన యేర్పడిన అహంకారము పంచతన్మాత్రలు సూర్యచంద్ర నక్షత్రాలు నవగ్రహములయందు'నేను' అనే కర్తృత్వ రహితమైన నేను" అనేదే స్వదృష్టి ఇది యెరుగుట యెరుగకపోవుట అను రెండు నెరుగనిదై రెండింటికి మధ్యలేక ఉండిలేనిదై ఆకాశం అవకాశం అదే వాచ్యార్థమున కతీతమైన (నేను) నీనా స్వదృష్టివున్నది.

గురుకటాక్షము చేత గ్రహించిన తెలివి లేనిమాయగనుక గ్రహించితినని గాని గ్రహించలేదనిగాని ఎట్టి నిర్ణయము లేక నిర్ణయానిర్ణయరహితుడవై యుండుటే స్వదృష్టిపరుడవైయుండుట, అట్టి స్వదృష్టిలో అవసరమైన

పనులన్నియు తప్పక చేయవచ్చును. నాయనా అట్లు చేయకుండుట వలన నీకు దేహయాత్రయైనను లభించదు

**ఉదా: భగవద్గీత 3వ అధ్యాయము కర్మ యోగము.**

8. శ్లో॥ నియతం కురు కర్మత్వం కర్మజ్యాయో హ్యకర్మణః
శరీర యాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః

తా॥ కర్మలు వదులుట కంటె ఒనర్చుటయే ఉత్తమ మార్గము కర్మలుచేయక పోవుట వలన నీకు దేహయాత్ర కూడా లభించదు అని అర్జునుడు తాను యుద్ధము చేయనని అన్నపుడు శ్రీకృష్ణుడు చెప్పినాడు. "యెవ్వరు చేయు వృత్తిని వారు (సన్యాసమనే భ్రాంతితో) మానుటకంటె చేయుటయే మేలు. ఆవిధముగా వారు తమ తమ వృత్తులను మానినచో లోకములో వారికి నిత్యకృత్యము కూడా జరగదని "చెప్పినాడు. (ఉ॥) ధర్మవ్యాధుడనే మహాయోగి మాంసం అమ్ముకుని జీవించేవాడు. జనకుడు రాజ్యమేలినాడు. నీవు రాజ్యమేల వలసిన వాడవు. కనుక యుద్ధము సంభవించినపుడు తప్పనిసరిగా యుద్ధము చేసి తీరవలెను. లేని యెడల నీవు ఆరోగ్యముగా జీవయాత్ర గడపలేవు.

లేనిమాయ ప్రపంచములో లేకనే న్యాయాన్యాములున్నవి. కనుక స్వదృష్టియందు నీవు ఒకప్పుడున్నట్లుగాని, లేనట్లుగాని, నీకు తోచనప్పటికి లేని తెలివితో అనగా కర్తృత్వము లేని నీవు లేకనే న్యాయన్యాయములు పోషించుట మానవద్దు. నీవు నిజగురుపాదములకు నీ అహంకారమును గురుకట్నముగా ఉపదేశకాలమందు, త్రికరణశుద్ధిగా అర్పించి దానిని తిరిగి దొంగిలించనని అఘోర ప్రమాణము చేసితివి.

ఇప్పుడు నీశరీరము మాట్లాడు తెలివి గురునిదై యుండగా నీవు లేని వాడవై పేరొకరికని చూచుచున్నావు నాయనా నీ అహంకారమనే గుర్తు నీ గురునిదై యుండగా నీవు గుర్తు రహితుడవు అయియుండగా నీకన్నా వేరే యేది కనిపించినా గుర్తులేనిదేసుమా!



# చివరిమాట

ఇంతవరకు బ్రహ్మవిద్య గురించి యోగవాసిష్టము నుండియు భగవద్గీత నుండియు, గురుగీత నుండియు, అష్టావక్రగీతనుండియు, వివిధములైన శ్లోకములు వాటితాత్పర్యములు వ్రాయబడినవి. అనగా

త్రేతాయుగమున శ్రీరాముడు 16సంవత్సరముల ప్రాయమున తీర్థయాత్రలను సేవించి తిరిగి వచ్చిన తర్వాత మనస్సు వికలమై ఆహారపానీయ ములందు వస్త్రాభరణదారణ విషయములందు విరక్తి కలిగి అతి సామాన్యుని వలె నుండెను. (ఇటువంటి పరిస్థితి క్రీస్తుపూర్వము 500 సం॥లందు బుద్ధునికి కూడా తీర్థయాత్రలు తిరిగి వచ్చిన తర్వాత కలిగినది) ఆపరిస్థితి వలన కడు విచారమున ఉండెను. ఆ సమయమున యాగసంరక్షణార్థము శ్రీరాముని తీసుకొని వెళ్ళవలెనని విశ్వామిత్రుడు వచ్చి శ్రీరాముని దీనావస్తను చూచి అతనికి బ్రహ్మవిద్య అవసరమని యెంచి. వసిష్టునితో బ్రహ్మవిద్యను రామునికి బోధించవలసినదిగా కోరెను. అంతట వశిష్టుడు ఆవిద్యను 20 రోజులు చెప్పినాడు. ఆ 20 రోజులు వాల్మీకి నారద తుంబురుడు సిద్దులు మొదలైనవారు వినిరి. ఆబ్రహ్మవిద్యను వాల్మీకి మహర్షి "యోగవాసిష్ట" మను పేరున వసిష్టుడు చెప్పిన "వసిష్టగీత " ను గ్రంధముగా వ్రాసెను.

త్రేతాయుగముననే జనక చక్రవర్తి యాజ్ఞవల్క్యుని వద్ద వుపదేశమును పొందినప్పటికి అది అర్థముకాలేదు. అందుచేత ఎందరినో గురువులను పొందినాడు. అయినప్పటికి తనకు అస్థితి కుదరలేదు చివరకు అష్టావక్రుని వలన అస్థితి కుదిరి బ్రహ్మజ్ఞాని అయినాడు జనకచక్రవర్తి. ఆవిద్యను "అష్టావక్రగీత "అందురు.

వ్యాసుని కుమారుడు శుకుడు తండ్రి వద్ద బ్రహ్మవిద్యా బోధను విని తృప్తి చెందలేదు, వ్యాసుడు తనకుమారుని బ్రహ్మవిద్య కొరకు జనక చక్రవర్తి వద్దకు పంపినాడు. శుకుని వెంటనే ఆహ్వానించక 3 వారములు జనక చక్రవర్తి పరిక్షించి చివరకు తన శిష్యునిగా చేసుకుని బ్రహ్మవిద్య చెప్పినాడు.

శుకుని వలన సాందీప మహర్షి బ్రహ్మ విద్యను తెలుసుకున్నాడు.

ద్వాపరయుగాంతమున శ్రీకృష్ణుడు దేవకివసుదేవులకు జన్మించినాడు.

విధివశమున యశోదనందుల వద్ద పెరిగినాడు. శ్రీకృష్ణుడు చిన్నతనము నుండి తన పూర్వజన్మ సుకృతమునునుసరించి అతనికి మహామహిమలు అలవడినవి. వాని వలన కృష్ణుని చిన్నతనము నందు పూతన పాలు నిచ్చుమిషతో వచ్చి విషపుపాలు యిస్తూ చనిపోయినది. కృష్ణుని అల్లరివలన తల్లి రోలుకు కట్టగా దానిని దొర్లించుకొనిపోతూ 2చెట్లకు ఢీకొనడంతో ఇద్దరు యక్షులకు శాపవిమోచనం జరిగింది. కృష్ణుడు మన్నుతిన్నాడని ఒకడు యశోదకు చెప్పగా నోరుతెరవమని అడిగినప్పుడు శ్రీకృష్ణుడు తన నోటిని తెరచి ముల్లోకములను యశోదకు చూపినాడు. తరవాత కాళింది మర్ధన చేసినాడు, మరల మందరగిరి పర్వతాన్నియెత్తి గోవులను, సంరక్షకులను, దేవేంద్రుని రాళ్ళ వర్షమునుండి రక్షించినాడు. ఇదంతయు శ్రీకృష్ణుని పూర్వజన్మసుకృత ఫలితమేగాని నేర్చుకున్న గారడీవిద్యలు కావు మరియు ప్రజలను నమ్మించుటకు కాదని గ్రహించవలెను. తరవాత కంసుని, కొంతమంది రాక్షసులను సంహరించినాడు. తరవాత యెనమండుగురు భార్యలను వివాహము చేసుకున్నాడు. తర్వాత పైజెప్పిన అద్భుత విద్యలను చూచిన ప్రజలు శ్రీకృష్ణుని కృష్ణభగవానుడని కృష్ణపరమాత్ముడని పిలువసాగిరి. ఆవిధముగా తనను ప్రజలు అనడం ఇష్టపడలేదు. తన చిన్నతనమున అన్న బలరాముడు సుధాముడను కుచేలుడు వగయిరాలతో సాందీప మహర్షివద్ద ప్రాథమిక విద్య నేర్చుకుంటున్న కాలములో ఒక సందర్భమున పరబ్రహ్మ స్వరూపమునుగూర్చి యీ క్రింది విధముగా సాందీప మహర్షి చెప్పి యున్నాడు.

" పరబ్రహ్మ స్వరూపమనగా శబ్దస్పర్శరూప రస గంధములు లేక త్రిగుణములు లేక పంచభూతములతో సంబంధము లేక అండపిండ బ్రహ్మాండ మంతట ములుగ్రుచ్చుసందు లేక ఉన్నదని " చెప్పిన విషయును జ్ఞప్తి యందుండుట వలన తాను పరబ్రహ్మ స్వరూపుడు కాదని తన నిజస్థితిని తాను తెలుసుకొనుటకు మరల సాందీప మహర్షి ఆశ్రమమునకు వెళ్ళి గురూపదేశమును తీసుకొని ఆయనకు చతుర్విధ సేవలు చేసి గురుపాదములకు సాష్టాంగవందనములతోను పాదతీర్థమును సేవించుట, భుక్తశేషమును భుజించుచు కర్తృత్వమును రహితము పొంది ఆరుమాసములలో బ్రహ్మవిద్యను గ్రహించినాడు.

తరవాత మహాభారత కురుక్షేత్ర యుద్ధసమయమున అర్జునుడు అజ్ఞానముతో వ్యామోహితుడై యుద్ధమునందు గురువులను తండ్రులను మేనమామలను స్నేహితులను చంపలేనని యుద్ధము చేయనని రథము దిగిపోతుండగా శ్రీకృష్ణుడు అతనిని వారించి బ్రహ్మవిద్యను చెప్పి వ్యామోహరహితునిగా చేసి యుద్ధము చేయించెను.

ఆవిధముగా చెప్పిన బ్రహ్మవిద్యను వ్యాసుడు "భగవద్గీత" గా మహాభారత మునందు పొందుపరచెను. ఈవిధముగా త్రేతాయుగమునుండి ద్వాపర యుగాంతము వరకు గురుపరంపరగా యీ బ్రహ్మవిద్యసాగినది.

ఈ విధముగా శ్రీకృష్ణుడు అర్జునునికి, ఉద్ధవునకు బ్రహ్మవిద్యను గరిపినాడు. ఉద్ధవుని వలన ఈవిద్య ప్రచారము జరిగినట్లు భాగవతములో చెప్పబడినది.

<u>**గురుగీత**</u> :- స్కాందపురాణములో ఉత్తర భాగమున యీ " గురుగీత " చెప్పబడినది.

ఒకనాడు శౌనకాది మహర్షులు సకలపురాణ ప్రవక్తయగు శ్రీ సూతమహర్షిని వినయ విధేయతలతో యీ విధముగా అడిగిరి. వేదములను ఆగమములను పూర్తిగా తెలుసుకొనిన ఓ సూత మహర్షివర్యా సమస్త మాయా మాలిన్యములను పూర్తిగా నాశనము చేయు గురు స్వరూపమును మాకెరిగింపుడనియు, దేనిని పొందిన మానవుడు సంసారబంధము నుండి విముక్తి పొందునో అటువంటి పవిత్రమయిన గురుతత్త్వమును మాకు చెప్పవలసినది గా వినయవిదేయతలతో వేడుకొనిరి.

అనాది మాయామయ సంసారమను గొప్పరోగమును నాశనము చేయు గురుగీతను నేను చెప్పెదను గనుక ఓ మునీశ్వరులారా మీరందరూ మిక్కిలి శ్రద్ధతో ఆనందముతో ఆలింపుడని చెప్పనారంభించెను.

పూర్వము కైలాసమందు ఒకానొకనాడు మహర్షుల మధ్యలో వ్యాఘ్రాసనమున గూర్చుని మునిసమూహమునకు పరమతత్వమును బోధించుచున్న సమయమున సమీపమున నున్న మహర్షులకు నమస్కరించు చున్న మహేశ్వరుని చూచి పార్వతి ఆశ్చర్యముతో యీవిధము గా నడిగెను. స్వామీ మిమ్ములను సకల దేవతలు రాక్షసులు, మానవులు యెల్లప్పుడు

పరమ భక్తితో నమస్కరింతురు గదా! తమరు నమస్కారము చేయు విధానమును చూచి చాల ఆశ్చర్యము కలుగుచున్నది. దానికి కారణము నాపై పరమ దయతో నాకు తెలియజేయవలసినదని కోరినది.

అపుడా పరమశివుడు ఓపార్వతి! నీవు ప్రశ్నించిన విషయము రహస్యములలోకెల్ల అతి రహస్యమైనది. అందుచేత ఎవరికి చెప్పగూడదు. ఇంతకు ముందెవ్వరికిని చెప్పియుండలేదు. అయినప్పటికి ఇటువంటి నిగూఢమయిన తత్వమును నీకుగల అత్యంత భక్తితో అడుగుచున్నావు కనుక ఆరంభించుచున్నాను ఆలకింపు మని మహేశ్వరుడు యిట్లు చెప్పనారంభించెను.

శ్రీసద్గురుతత్వమే మహోవుత్కృష్టమైనదనియు అటువంటి మహనీయునకే సకలార్ధములు సమకూరుననియు చెప్పుచున్నారు. అటువంటి గరుభక్తితో గురుదేవుని యందు, తైలధారవంటి నమ్మిక నిరంతరాయముగా ఎవరికి ఉంటున్నదో ఆమహాత్మునకు బ్రహ్మవిద్య అతి సులభముగా అవగాహనమై సందేహములు తొలగిపోయి సంకల్పము సిద్ధించు చున్నది. ఇది సత్యము.

శ్రీ గురుదేవునికి సాక్షాదీశ్వరునకు ఎటువంటి భేదము లేదు. గురువే ఈశ్వరుడు, ఈశ్వరుడే గురుదేవుడనియు స్పష్టపరచుచున్నారు.

గురువనగా గురుభక్తుల యొక్క హృదయ తాపములను, అజ్ఞానమును బాపి జన్మరాహిత్యమును చెందించును. అటువంటి శ్రీగురుదేవుడు సదామంగళ స్వరూపుడగు శివుడే గనుక అటువంటి శుభప్రదుడగు శ్రీ గురుమూర్తి సదాపూజనీయుడు.

ఓపార్వతి! ముల్లోకములందు దర్లభమైన పరమసత్యమును చెప్పు న్నాను, వినుము శ్రీ గురుదేవుడను బ్రహ్మయే పరబ్రహ్మము. ప్రపంచ ుయు శ్రీగురు పరబ్రహ్మను వదలి ఇతర పదార్ధమేదియులేదు. అంతయూ ము పరబ్రహ్మ స్వరూపమే ఇది సత్యము సత్యము సత్యము.

మరియు శ్రీ గురుదేవుని పాదకమల ద్వంద్వము యొక్క సంస్మరణము. శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములును ఆధ్యాత్మిక, ఆదిభౌతిక ఆదిదైవికములగు తాపత్రయములను రహితమొనరించుచున్నది, మరియు అనాదిగా జనన మరణ రూప మహాదుఃఖమును గలిగించునట్టి మహాసంసార

సాగరము నుండి సులభముగా జీవుని తరింపజేయుచున్నది. అటువంటి శ్రీ గురుదేవుని నేను నమస్కరించుచున్నాను. స్మరించుచున్నాను. అని పలికి ఇంకనూ గురు తత్త్వ విధానమును బోధించుచున్నారు.

**గురుగీత**

**29.** శ్లో॥ సర్వతీర్థావగాహస్య సంప్రాప్నోతిఫలం నరః।
గురోః పాదోదకం పీత్వాశేషం శిరసిదారయన్॥

తా॥ శ్రీ గురువరుని పాదతీర్థమును కడు భక్తితో మొదట లోపలికి సేవించి మిగిలిన తీర్థమును శిరస్సున ధరించుచున్న గురుభక్తుడు సకల తీర్థములలో విధి ప్రకారము స్నానమాచరించిన, ఎట్టి ఫలమును పొందునో అట్టి పరమప్రయోజనమును పొందుచున్నాడు.

**గురుగీత**

**31.** శ్లో॥ అజ్ఞాన మూలహరణం జన్మకర్మనివారకమ్।
జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం గురోః పాదోదకం పిబేత్॥

తా॥ శ్రీ గరుదేవుని పాద తీర్థమును సేవించుచున్న పరమభక్తునకు ఆత్మానాత్మ వివేక జ్ఞానము కలుగుచున్నది. తర్వాత సర్వ దృశ్యవిషయము లందు విరక్తి జనించుచున్నది. ఆసర్వవిషయ ప్రపత్తుల నిరోధించుట వలన జ్ఞానము గలిగి సకల జన్మములకు హేతుభూతములగు కర్మలు నాశనములగు చున్నవి. తరవాత ఆత్మజ్ఞాన జ్యోతిచే సర్వదృశ్య కర్మలకు కారణమగు మూలాజ్ఞానము సమూలముగ దగ్ధమగుచున్నది.

ఈవిధముగా సూత మహర్షి, మహేశ్వరుడు పార్వతికి చెప్పనున్న గురుగీతను ఈవిధముగా ఎన్నియో విషయములను శౌనకాది మహర్షులకు చెప్పెను. దానినే గురుగీత అందురు. ఇది మహేశ్వరుడు పార్వతికి చెప్పిన గురుసాంప్రదాయ బ్రహ్మవిద్యయే ఈవిధముగా శ్రీ సూత మహర్షి వలన "గురగీత" అను గ్రంధము కలిగినది.

ఈవిధముగా అన్ని గీతలను తెలుగు పండితులు చదవనివికావు. పరిక్షలకొరకు చదవవచ్చునేమోగాని అందుగల విషయములను అర్థము చేసుకొనలేరు, ఆచరణలో పెట్టలేరు. కారణం మానవులందరు మాయా

మోహితులు అవిద్యగలవారు అని చెప్పియున్నారు. అవిద్యను తొలగించుకొనుటకు పరమగురువరులైన సద్గురునిఆశ్రయించి యిందు చెప్పబడినట్లు గురువునకు నాలుగు సేవలుచేస్తూ సాష్టాంగనమస్కారములతో పాదతీర్థమును సేవించుట భుక్తశేషమును భుజించుట అను క్రియలను అభిమానమును వదలి ఆచరించి అహంరహిత స్థితిని పొంది దేహవాసన, లోకవాసన, శాస్త్రవాసన అను వాసనాత్రయము అను హృద యగ్రంథిని తృంచిన యెడల అవిద్యతొలిగి ఈ సంసారమనే ప్రపంచమున జననమరణము లనే బంధివిముక్తిని పొంది జన్మరాహిత్యమును పొందెదరు. అదే నిత్యశాంతి.

**గురుగీత**

**335**ఎ. శ్లో॥ శిష్యాణాం జ్ఞానదానాయ లీలయాదేహధారిణే।
నదేహాయ విదేహాయ తస్మైశ్రీ గురవేనమః

తా॥ వస్తుతః దేహములేని వాడైనను భక్తులకొఱకు దేహమును ధరించినవాడు శ్రీ గురువు. అటువంటి గురువునకు నమస్కారము.

**గురుగీత**

**339.** శ్లో॥ గురునామసమం దేవం నపితా న చ బాంధవాః।
గురునామ సమస్స్వామీ నే దృశం పరమం పదమ్॥

తా॥ శ్రీ గురునామస్మరణమే దైవము. రక్షించు తండ్రి హితమొనరించు బాంధవులు అగుచున్నారు. శ్రీగురునామస్మరణతో సమానమగు ప్రభువును లేడు. శ్రీ గురునామస్మరణమే మోక్షస్థానము. శ్రీ గురునామస్మరణమే యన్నిటికి మూలమని భావము.

**గురుగీత**

**340.** శ్లో॥ ఏకాక్షర ప్రదాతారం యో గురుం నైవ మన్యతే।
శ్వాన యోని శతం గత్వా చండాలేష్వపి జాయతే॥

తా॥ శ్రీ గురుదేవుని విస్మరించినవాని గతిని విశదపరచుచున్నారు. వేదములకును, మంత్రములకును శిరస్సై పరమసారమై జపించినంత మాత్రమున ప్రాణమును ఊర్ధ్వముగా జేయునట్టియు క్షణములో చిత్తలయమును పొందించునట్టియు. దృశ్యరహితమైనట్టియు నగు పరబ్రహ్మమును బోధించునట్టి మహాత్ముని (గురువును) ఏశిష్యుడు

తలంచనేతలంచడో అట్టి కృతఘ్నుడగు పాపాత్ముడు వంద కుక్కయొక్క జన్మములబడసి తుదకు చండాలురయందు పుట్టుచున్నాడు. ఇదంతయు కృతఘ్నత్వము యొక్క ఫలితమనే తెలియవలెను. అందుచేత బ్రహ్మవిద్యకొరకు పరమగురుని చేరిన శిష్యులు గురునియందు త్రికరణ శుద్ధిగలిగి తైలధారవంటి నమ్మిక కలిగి నాల్గు సేవలు చేయుచు సాధన చతుష్టయ సంపత్తిని అభ్యసించిన వానిని సద్గురుడు కరుణా కటాక్ష వీక్షణములతో హస్తమస్తక సంయోగముతో పరమరహస్యమగు బ్రహ్మవిద్యను తగు సూచనలతో సిద్ధింపజేయును.

# బ్రహ్మ విద్య సారాంశము

అహంకార రహితము- జగత్ భ్రాంతి రహితము. ప్రపంచము మాయచేత ఆవరింపబడియున్నది కనుక ప్రతి జీవికి అహంకారమున్నది. అహంకారము లేని మానవుడులేడు అహంకారము మానవుని పశువుగామార్చును. దురహంకారము మానవుని రాక్షసునిగా మార్చును. అహంకారముతో మమకారముండును. ఈ రెండింటివల్లనే జననమరణములు సుఖ దుఃఖములు మొదలైన ద్వంధ్వములుకలుగుచున్నవి.

తపస్సులు తీర్థయాత్రలు పర్వదినములలో తీర్థస్నానములు, దానధర్మములు, యజ్ఞయాగములు, యోగాభ్యాసములవలన బ్రహ్మజ్ఞానము కలగదు. జన్మరాహిత్యము కలగదు.

అహంకారము సద్గురుని వల్లనే నిర్మూలించు కొనవచ్చును. అనగా సద్గురునిచే ఉపదేశము తీసుకుని సాధన చతుష్టయ సంపత్తిని అలవరుచుకొని ఆయనకు తనుధనమాన ప్రాణములనే అహంకారమును ధారవోసి చతుర్విధ సేవలు చేసిన యెడల ఆయన కరుణాకటాక్షములచేత అహంకారముతో సహా జగత్ భ్రాంతి నిర్మూలమగును. అనగా దేహవాసన, శాస్త్రవాసన, లోకవాసన మూడును నిర్మూలమై హృదయగ్రంధి ఛేధింపబడును. అదియే అహంకార రహితము. అహంకారము లేని మానవుడు పరబ్రహ్మస్వరూపుడు. అటువంటి మానవుడు నిత్యానందుడు. వానికి కష్టసుఖములు మానావమానములు జనన మరణములుండవు అదే జన్మరాహిత్యము.

పరిపూర్ణ బ్రహ్మవిద్య సమాప్తము



# భజన కీర్తనలు

**1 వ కీర్తన త్రిశగతి తాళము.**

రామ చంద్రరాజయోగి భజనచేయరే
జనన మరణ భ్రాంతి రహిత మార్గము గనరే ।శ్రీ.. ॥రామ॥

1. లేని మాయ జనితమైన పంచభూత సమ్మేళన
సృష్టి స్థితిలయములని తెలుసుకొని భ్రాంతివిడచి ॥రామ॥

2. శబ్ద స్పర్శరూపము రస గంధముల నే తన్మాత్రలు
సద్గురునకు సమర్పించి సాష్టాంగ ప్రణామముతో ॥రామ॥

3. పాప పుణ్యభావము సుఖదుఃఖపు భావము
జాడలేని బాటగని తానులేని తావుచేరి ॥రామ॥

4. కలలో తోచిన శరీరమెంతో ఇది అంతేనని
పలుమారులు తలచి తలచి తనువునందు భ్రాంతివిడచి ॥రామ॥

5. నాలుగు సాధనములను నాణ్యముగా ఆచరించి
దేహవాసనాదులనే హృదయగ్రంధి తెగనరికి ॥రామ॥

6. ధర్మాధర్మములు విడచి మమకారహంకారమొదలి
సద్గురునే శరణువేడి - అరఘడియైనను మరవక॥ ॥రామ॥

7. వెంకటేశ్వర రాజయోగి గురుని చేరి కడతేరెను
తైలధారవంటి మంచి నమ్మికతో గురుని తలచి ॥రామ॥

**గురుగీత**

111. శ్లో॥బ్రహ్మానందం। పరమసుఖదం। కేవలంజ్ఞానమూర్తిం
ద్వంధ్వాతీతం। గగన సదృశం తత్వమశ్యాది లక్ష్యం
ఏకం నిత్యం। విమల మచలం। సర్వదీసాక్షి భూతం
భావాతీతం। త్రిగుణరహితం। సద్గురుంతం నమామి

**౭వ కీర్తన -ఆదితాళము.**

ప॥ బ్రహ్మానంద స్వరూపుడు గురుడు
పరమసుఖమ్మును ఇచ్చెడి గురుడు

1. ఏకస్వరూపుడు జ్ఞానస్వరూపుడు
ద్వంధ్వాతీతుడు అద్వితీయుడు
అతి పవిత్రుడు అచలుడు.
సర్వప్రాణుల బుద్ధికి సాక్షుడు ॥బ్రహ్మా॥

2. ఆకాశముతో సమమైనవాడు
భావాతీతుడు త్రిగుణ రహితుడు
తత్త్వమస్యాది లక్ష్యాతీతుడు
జననమరణములు లేని నిర్మలుడు ॥బ్రహ్మా॥

3. కలమెలకువలు లేని మహాత్ముడు
మూడుకాలముల బాధలు దాటిన
శ్రీగురుదేవున కు వెంకటేశ్వర
రాజయోగిసా -ష్టాంగ వందనం ॥బ్రహ్మా॥

**గురుగీత:**

**41.** శ్లో॥ స్వాశ్రమంచ స్వజాతిం చ స్వకీర్తిం పుష్టి వర్ధనం।
ఏతత్సర్వం పరిత్యజ్య గురుమేవ సమాశ్రయేత్॥

తా॥ తాను ఏ ఆశ్రమములో నున్నవాడైనను ఆ ఆశ్రమాభిమానమును వదలి తాను బ్రాహ్మణ జాతికి చెందినవాడైనను కులాభిమానమును వదలి కీర్తి ప్రతిష్టలు, అధికమైన ఐశ్వర్యవములున్నప్పటికి గర్వింపక సంసార దుఃఖముతోకూడినవాడై దేహేంద్ర్య అభిమానమును కూడా వదలి పరమగురువును చేరి భక్తితో ఆశ్రయించాలి. ఆగురుదేవుని జాతి బేధములను కూడా చూడక పరమ భక్తితో ఆశ్రయించాలి. జనకుడు ఇటువంటి బోధకొరకు ధర్మవ్యాధుడనే మాంసము అమ్ముకుని జీవించుచున్న మహానుభావుని వద్దకు వెళ్ళి ఆయన బోధను వినేవాడు. ఈవిధముగా గురుదేవుని యొద్దకు చేరి శిష్యుడు అభిమానమును వదలి బ్రహ్మవిద్యను నేర్వవలెను.

**గురుగీత:**

**46.** శ్లో॥ గుకారశ్చ గుణాతీతో రూపాతీతో రుకారకః।
గుణరూప విహీనత్వాద్గురు రిత్యభిధీయతే ॥

తా॥ గురుఅను రెండక్షరములలో గుకారమునకు త్రిగుణములను(మూడు గుణములు) అతిక్రమించిన వాడనియు (దాటినవాడని యు) రుకారమునకు రూపము లేనివాడనియు అర్థము. ఇట్లు గురువు త్రిగుణములు దాటి రూప రహితుడైన మహానుభావుడని వేధాంత శాస్త్రములు చెప్పుచున్నవి. పరబ్రహ్మ స్వరూపము గుణ రూపరహితమైనది. కనుక గురువు పరబ్రహ్మస్వరూపుడే.

**3వ కీర్తన - ద్రాద్ర తాళము.**

ప॥ సాష్టాంగ వందనమ్ము సేయరే।
గురుపాదములకు సాష్టాంగ వందనమ్ముసేయరే॥

**1.** అహమే యీదేహము - అహమే యీ విశ్వము
అహమును వదిలించుకొనుటకిదే మంచి సాధనమ్ము
తన తనువును తన గురువునకర్పించిన సద్గురునకు ॥సా॥

**2.** నీ తనువును నీ గురునకు గురుకట్నముగానిచ్చి
తిరిగి దొంగిలించనని ఘోరప్రమాణముజేసి॥ ॥సా॥

**3.** గురునదేమి కులమని గురునదేమి జాతియని
నిరసన జేయకుమా నీదెంత గొప్ప కులమైనా॥ ॥సా॥

**4.** గుణరహితుడు గురుడు - రూపరహితుడు
శబ్దస్పర్శ రూపము రస గంధరహిత సద్గురునకు॥ ॥సా॥

**5.** నీయహమును వదిలి ంచును సద్గురుడు
అహములేని సద్గురుడు - తనువులేని గురుశిష్యులు
జననమరణ స్థితులులేని పరబ్రహ్మస్వరూపులే॥ ॥సా॥

**6.** సాష్టాంగవందనమ్ము దుష్టహమును ధృంచునని
స్పష్టముగా చెప్పెను ఈ వెంకటేశ్వర రాజయోగి॥ ॥సా॥

**గురుగీత :**

**344.** శ్లో॥ సప్తకోటి మహామంత్రాః చిత్తవిభ్రమకారకాః॥
ఏకఏవమహామంత్రో గురురిత్యక్షరద్వయమ్॥

తా॥ జనులు సులభముగా తరించుమహోత్తమ మంత్రమును చెప్పుచున్నారు. ప్రత్యక్షముగ అన్ని విధములచే మార్జాలకిషోర న్యాయముననుసరించి నిరంతరము సంరక్షించుచున్న శ్రీ గురుదేవుడే సాక్షాన్ మహేశ్వరుడు శివ అను మహామంత్రమువలె గురు అను మహామంత్రము తారక మంత్రమై భక్తులను తరింపజేయుచున్నది. సప్తకోటి మహామంత్రములు కూడా చిత్తమును చెరచునవేగాని వానిచే జ్ఞానముగాని శాంతిగాని లభించదు గురు అను రెండక్షరముల మంత్రము చిత్త శాంతిని గలిగించి జ్ఞానమును కలిగించునది కనుక ఈ ఒక్క మంత్రమే చాలును.

**4 కీర్తన- దాద్రతాళము.**

మానవుడా ఓమానవుడా
దేవుడవు నీవే - రాక్షసుడవు నీవే
దేనిమీద మనసుంటే అదే నీవు అవుతావు
మనసుకు కళ్ళెంవేసి మంచిదారి చూసుకో ॥మా॥

1. మమకారం నీకుంటే చచ్చినీవుపుడతావు
మమకారంలేకుంటే ఏవికారముండదు
మమకారహంకారములు సుఖదుఃఖపునిలయుము
అహమును నిర్మూలించిన - మానవుడే దేవుడు ॥ మా॥

2. దుర్మార్గపు మనసుండిన - దరికానని గుడ్డివాడు
మంచినీతి వినబడదు - మంచిదారి కనబడదు
హత్యలు అత్యాచారము దోపిడీలు వినోదం
పేరుకు మానవుడైనా రాక్షసుడే కదా మరి ॥మా॥

3. కోట్లు కూడ బెట్టుటకు యెన్ని పాట్లొపడతావు
ఆరోగ్యం పోగొట్టుకు గడ్డితిని బ్రతుకుతావు
ఆరోగ్యం మహాభాగ్యమని నీకు అర్థమైతే
అన్యాయపు సంపాదన నిలిపి నీతి పెంచుకో ॥మా॥

4. చెప్పకనేవస్తావు చెప్పకనే పోతావు
వచ్చినాపోయినా నీతో రాదేమీ
కలలో జీవితమెంతో ఇలలో జీవితమంతే
శాశ్వతమ్ము కానిదానికెందుకు జంఝాటం ॥మా॥

5. ఏడుకోట్ల మంత్రాలు చిత్తశాంతి నివ్వలేవు
గురుఅను రెండక్షరాలు చిత్త శాంతినిచ్చును
గురుని చేరలేనివాడు - మహా పండితుండైనా
పరమ పదము పొందలేడు అహము పెరిగి పశువౌను ॥మా॥

6. అరువది నాలుగు విద్యలు అహమును వదిలించలేవు
అరువది యైదవ విద్య బ్రహ్మవిద్య శాంతినిచ్చు
పరమగురుడు ధరలోనే నీఅహమును వదిలించును
త్వరితగతిని గురునిచేరి అభ్యసించు బ్రహ్మవిద్య ॥మా॥

**5 కీర్తన - ఆదితాళము**

కలలో తోచిన శరీరమెంతో
ఇలలోగల యీ శరీరమంతే
మెలకువతో మూలము లేని తనువు
కలమేల్కొనగా కనరాదంతే ॥కల॥

1. కలలో చూచిన దృశ్యములెన్నడు
మెలకువతో ఒకటైన మిగలదు
మెలకువలోని శరీరము మేల్కొన
ఇలయే కలయని దృఢపడిపోవును ॥కల॥

2. వేదములో వేదాంత సారము
దేవునిలో దేవాంత సారము
దేవదేవుడని నిజగురు నమ్మిన
దేహమునకు కలమెలకువలేదు ॥కల॥

3. తను ధనమానము ప్రాణము గురునకు
వినయముతోడను వదలిన వానికి
కనబడదిక తన తనువు తగులుకొని
తనకిక లేదిల జనన మరణము ॥కల॥

4. గురువరుని కొలిచి నాల్గుసేవల తొ
మరిమరి నాలుగు సాధనలు సేర్చి
త్వరితముగ భ్రాంతి రహితమొందమని
వెంకటేశ్వర రాజయోగనెను ॥కల॥

**గురుగీత**

87. శ్లో॥ సప్తసాగర పర్యన్త తీర్థస్నానఫలం తు యత్
గురోఃపాదోద బిందోశ్చసహస్రాంశేన తత్ఫలమ్ ॥

తా॥ ( సప్తసాగర) దధిక్షీరాది సప్తసాగరముల వరకు గల సకల పుణ్యతీర్థముల యందలి స్నానము చేయుటలో కలుగు ఫలితమేదున్నదో శ్రీ గురుపరమాత్మ యొక్క పవిత్ర పాద తీర్థములోని ఒకబొట్టు యొక్క వెయ్యవవంతు భాగముతో సమానము కాదని చెప్పుచున్నారు.

**6వ కీర్తన - ఆదితాళము.**

మూలములేని - గుర్తెరిగె శరీరమేమిలేదు లేదని
పలుమారులుగా పలికినాగాని -అహముపోదని తెలియండి ॥

1. పరమ గురుని పాదములను బట్టి - నీతనువు ప్రసాధముగానిచ్చి
పదిలముగ నాల్గు సేవలు జెయుచు - నిరతము సేవించిననేగాని ॥మూ॥

2. శత్రుమిత్రులని కష్టసుఖములని - మానావమాన తలపులు మరచి
నిత్యానందము గలిగినవాడే- బ్రహ్మాస్వరూపుడు తెలియుమురా ॥మూ॥

3. సప్తసంద్రాల పరిధిలోన గల - పుణ్యానదులలో మునిగితేలినా
గురుపాదతీర్థ బిందువులో సహ - స్రారవంతుతో సమముగాదురా ॥మూ॥

4. భవరోగానికి గురుశుశ్రూషే - పరమ పథ్యమని తెలియుమురా
మనసు కుదుటపడి పరిపక్వమౌను అదియే అహముకు అంతిమ మార్గము ॥మూ॥

5. సాధన సంపత్తిని గురుముఖముగ ఆచరించని అధమాధములకు
హృదయగ్రంధి యేనాటికితెగదని - వెంకటేశ్వర యోగి చెప్పెను.॥మూ॥

**7వ కీర్తన -ఆదితాళము**

1. సాధనలేనిదె ఏపని సాధ్యము
కాదనివినరా నరవరా
సాధనతో సమకూరుపనులనీ
వాదన లేకనె వేమనజెప్పెను. ॥సాధన॥

2. సాధనెందుకు బ్రహ్మావిద్యకని
సావధానముగ చెప్పిరి కొందరు

లోకములో గల రోగము లన్నియు
మందూపథ్యము చేయకకుదరవు ॥సాధన॥

3. భవరోగానికి బ్రహ్మవిద్యయే
పరమౌషధమని చెప్పిరి పెద్దలు
భవరోగానికి సాధన చేయుట
సద్గురు సేవయు దివ్యౌషధములు ॥సాధన॥

4. అరువది నాలుగు విద్యలలోను
అన్నివిద్యలకు సాధనౌసరం
అరువది యైదవ బ్రహ్మవిద్యకు
అక్కరలేదా సాధనలు ॥సాధన॥

5. అథాతో బ్రహ్మ జిజ్ఞాసా అని
బ్రహ్మసూత్రము చెప్పగ లేదా
సాధన చతుష్ట సంపత్తియని
సాధనలు నాల్గు చెప్పిరిగాదా ॥సాధన॥

6. వెంకటేశ్వర రాజయోగి
సాధనలన్నీ పాటించెనురా
ఈ మార్గము కాదింకొకటంటే
చావుపుట్టుకలు తప్పవురా ॥సాధన॥

**గురుగీత శ్రీ సద్గురు ధ్యానము (నిత్యము చేయవలసినది) ద్రాత్రతాళము.**

110. శ్లో॥ శ్రీ మత్పరం బ్రహ్మ గురుం స్మరామి
శ్రీమత్పరం బ్రహ్మ గురుం భజామీ
శ్రీ మత్పరం బ్రహ్మగురుం వదామి
శ్రీ మత్పరం బ్రహ్మగురుం నమామి

తా॥ సర్వదా జ్ఞానసంపత్తి గలగి పరబ్రహ్మస్వరూపుడైన శ్రీగురుదేవుని నిరంతరము నాచిత్తమున చింతించుచున్నాను. తేజస్వరూపుడై పరబ్రహ్మ స్వరూపుడగు శ్రీ గురువర్యుని నేను ఎల్లప్పుడు సేవించు చున్నాను. పూజించుచున్నాను. ఈవిధముగా శ్రీ సద్గురు మూర్తి యొక్క స్మరణము భజనము స్తుతి, నమస్కారములు వీని రూపమైన ధ్యానమును త్రికరణశుద్ధిగా

చేయవలయునని చెప్పిరి. నమస్కారము పూజలచే కాయశుద్ధియు, శ్రీ గురుదేవుని నామసం కీర్తనాదులచే వాక్కుశుద్ధియు, నిరంతరము చింతనారూపధ్యానముచే అంతఃకరణ శుద్ధియు కలుగును. ఇట్టి ధ్యానముచే పరబ్రహ్మ స్వరూప గురుతత్త్వజ్ఞానమును బడయగలరు.

శంకరాచార్యుల వారి భజగోవిందము నుండి

శ్లో॥ సత్సాంగత్వే నిస్సంగత్వం - నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే - నిశ్చలతత్వం - నిశ్చలతత్వే - జీవన్ముక్తి

**8 వ కీర్తన - ఆదితాళము**

సత్సాంగత్యము - చేయుమురా
దుస్సాంగత్యము వదలుమురా
సద్గురుపాదము పరమపదమురా
సద్గురునే ధ్యానించుమురా ॥స॥

1. దుర్వ్యసనములను మానుమురా శ
రీరారోగ్యమునిలుపుమురా ఆ
రోగ్యములేని బ్రతుకువ్యర్థము
సత్పురుషుల దరి చేరలేవురా ॥స॥

2. స్వర్గభోగముల కాశపడి
యజ్ఞయాగములు చేయకురా
ధనము తరుగును అహము పెరుగును
నిత్యానందము గలగదెన్నటికి ॥స॥

3. సత్సాంగత్యముతోనే వాల్మీకి
విశ్వామిత్రులు ఋషులైరి
సత్సాంగత్యము క్షణకాలమైన
సత్సంపదలను ఒసగునురా ॥స॥

4. సకల ప్రపంచము మాయామోహము
జనన మరణముల సుడిగుండమురా
వెంకటేశ్వర రాజయోగిని
వెంటాడిన సుడి గుండాలుండవు ॥స॥

**9వ కీర్తన -ఆదితాళము**

నిత్యానందము పొందండి
సద్గురు సన్నిధి చేరండి
దేవాలయములు భ్రమయేనండి
గురువు త్రిమూర్తులు నమ్మండి ॥

1. మీకు కలిగిన కష్ట సుఖములు
దేవుడిచ్చినవి కావండి
పూర్వజన్మలో మీరు చేసిన
కర్మఫలములని తెలియండి ॥నిత్య॥

2. మూఢనమ్మికలు మానండి
మ్రొక్కులజోలికి పోకండి
ఎవరికర్మములు వారేతప్పక
అనుభవించవలె - నమ్మండి ॥నిత్య॥

3. ప్రపంచమంతా బ్రహ్మమయం
త్రిగుణరహితమే పరబ్రహ్మము
సద్గురు చెంతకు చేరిన తోడనే
పరబ్రహ్మమే -మీరండి ॥నిత్య॥

4. గురువు బ్రహ్మము గురువె విష్ణువని
గురుదేవుడె ఇల మహేశ్వరుండని
గురుసాక్షాత్పర బ్రహ్మంబేయని
పరమశివుడు గురుగీతగ జెప్పెను ॥నిత్య॥

5. ప్రారబ్ధకర్మమెంతయుండునో
అంతే ఆయుషు ఉంటుంది
మ్రొక్కులు మ్రొక్కిన ఆయుషు పెరగదు
గురుడే మరణపు భయమునుదీర్చును ॥నిత్య॥

6. అహంకారమొక భవరోగం
అదియే తీరని భవరోగం
వెంకటేశ్వర యోగి చెప్పిన
వేదమునమ్మిన రోగముకుదురున్ను ॥నిత్య॥

**10వ కీర్తన -ఖండచాపు తాళము**

ప॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు గురుర్దేవ మహేశ్వరః
గురువు సాక్షాత్పర బ్రహ్మా తస్మైశ్రీ గురువేన్నమః గురవేన్నమః

అ॥ గురుని నిజగురునిగని తరియించు సేవించి
గురిని నిల్పకనీవు హృదయగ్రంధిని త్రెంచు ॥గురు॥

1. చీమ చిటుకూ మొదలు బ్రహ్మాపర్యంతము
శబ్దము స్పర్శరస రూప గంధము లేక
నిండియున్నది యొకటి ఉండి వుండకను
నిండుగా గురునమ్మి ఉండు ఉండకను ॥గురు॥

2. అవతారమూర్తులైనా అపరపరబ్రహ్మాలైనా
నరులేకదా రామచంద్రుడు కృష్ణుడు
గురునిచేరీ కొలిచి పరధర్మమొందినారూ
పరమాత్ములై నిలిచి ఇలవెలసినారు ॥గురు॥

3. రామునికి మదిలోన వసిష్టుడే గురువు
కృష్ణునికి సాందీప మహర్షి గురువు
గాండీవికొలిచిన శ్రీ కృష్ణుడే గురువు
శ్రీరామచంద్రయోగీంద్రుడే నాగురువు ॥గురు॥

4. ధరలోన గల విద్యలరువదీ నాలుగు
సర్వవిద్యలు మదిని గురువు లేకను మనవు
గురువులేని విద్య గృడ్డివిద్యయెగాదె
గురువు కావలెమదిని - బ్రహ్మావిద్యకునైన ॥గురు॥

5. జన్మరాహిత్యమ్ము పొందవలెనంటేను
గురుని చేరక వేరు మార్గమే లేదని
వెంకటేశ్వర రాజయోగి చెప్పినమాట
విన్నవారే జన్మరాహిత్య మొందెదరు ॥గురు॥

**11వ కీర్తన- మిశ్రచాపు**

పః నిజము తెలిపెదనమ్మరా నీ
జన్మసార్థకమౌనురా ॥నిజ॥

1. ఇహములోగల మహిమలను నీ
అహమువల్లనె సహజమునుకొని
రజ్జుసర్పభ్రాంతి వోలెను
జగము నీ కనిపించురా ॥ నిజ॥

2. మాయలోకపు మహిమలన్నీ
మాయయేయని పింపజాలవు
నిమురుగప్పిన నిప్పువోలెను
నిజము తెలియదు నిజమురా ॥నిజ॥

3. పరుల మనుజుడు మరణమొందిన
చిరువిచారము చెందరెవ్వరు
బోరుబోరున యేడ్చునే తన
వారుమరణము జెందినప్పుడు ॥నిజ॥

4. కర్మతోనే జన్మకలుగును
జన్మతోనే అహము కలుగును
అహముతో మమకారముండును
రెంటివల్లనే కర్మకలుగును ॥నిజ॥

5. అహము నిజగురు మహిమ పొందిన
దేహవాసన శాస్త్రవాసన
లోకవాసన లూడిపోవును
హృదయగ్రంధి మాడిపోవును. ॥నిజ॥

6. గురుని నమ్మి అహమునొదలి
నిరతముగ సేవించు చుండిన
గురువెనీపై నీవె గురువై
జననమరణపు భ్రాంతి దీరును ॥నిజ॥

7. వెంకటేశ్వర రాజయోగి
గురుని సాక్షిగ నుడివినట్టి
పరమసత్యము నమ్మినట్టి
శిష్యకోటి జన్మధన్యము ॥నిజ॥

**గురుగీత :**

**44.** శ్లో॥ గుకారశ్చాన్ధకారోహి రుకారస్తేజ ఉచ్యతే
అజ్ఞానగ్రాసకం బ్రహ్మాగురురేవ న సంశయః ॥

తా॥ "గురు" అను రెండక్షరముల యొక్క అర్ధము "గు" కారమునకు అజ్ఞానాందకార వాచకము "రు" కారము జ్ఞానతేజోవాచకము ఈ విధముగా వేదాంత శాస్త్రము చెప్పుచున్నది. వెలుతురు చీకటి పరస్పర విరుద్ధమగుట చేత అజ్ఞానమనే చీకటిని జ్ఞానప్రకాశము క్షణములో పారద్రోలును, కనుక ఈవిధముగా శ్రీ గురుదేవుడు సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపుడు.

**12వ కీర్తన- త్రిశ్రగతి తాళము.**

ప॥ గురుడనగా బ్రహ్మావిష్ణు మహేశ్వరులు నరవరా
గురుడనగా నరుడని భ్రమ చెంది మోసపోకురా
గురువుకు తను ధనమాన ప్రాణములర్పించిన
ఆగురువే నిజ గురువు పరమ గురువే నిజగురువు ॥గురు॥

1. ధరనెనుబది నాలుగు లక్షల సజీవరాసులలో
నరజన్మము గొప్పది మరి పరిపరి విధముల జూచిన
పరమార్ధము కొరకు గురుని త్వరపడి జేరకయుండిన
నరజన్మము మరలరాదు తిరమెరుగని నరులకు ॥గురు॥

2. ఒప్పుచుండె మూడుకోట్ల దేవతలీలోకమందు
తప్పదు జన్మము మరల యే దేవుని కొలిచినా
తిప్పలు పడుదురునానా జన్మలలో మునిగి తేలి
ఒప్పుగ గురు పాదములను బట్టి అహము ఒదిలిపెట్టు ॥గురు॥

3. తను ధనమాన ప్రాణము సద్గురునకు అర్పించి
సద్గురుడే పరబ్రహ్మ స్వరూపుడని నమ్మికొలిచి
వెంకటేశ్వర రాజయోగి నడచినట్టి బాటగని
వేగమె గురుననుసరించి హృదయగ్రంధి తెంచుకొనుము. ॥గురు॥

**13 కీర్తన- దాద్రతాళం**

వెంకటేశ్వర రాజయోగి మందువాడరే
భవరోగపు రూపుమాపి భ్రాంతిరహిత మొందరే
భ్రాంతి రహిత స్థితియేరా జననమరణ రహితము ॥వెంక॥

1. భవరోగము మానవులకు మాయగొల్పును
మాయవల్ల అహము కలిగి భ్రాంతి కలుగును
అహము వల్ల మమత కలిగి కర్మకలుగును ఆ
కర్మవల్ల జనన మరణ స్థితులు కలుగును ॥వెంక॥

2. తాపత్రయ మందురేయెన్నడైన విన్నారా
తానసె అహమున్నవారు తాపత్రయ బాధితులే
అధ్యాత్మిక అదిభౌతిక అదిదైవిక తాపత్రయ
బాధలన్ని పారద్రోలి శాంతి పొందరే ॥వెంక ॥

3. ఎన్ని జన్మలెత్తినా మరుగు తెలియదు
గురుని చేరలేనివాడు కళ్ళుతెరవడు
సజ్జన సాంగత్యమే సద్గుణముల సంపాదన
సత్వరమే గురుని చేర అహము వదులును ॥వెంక॥

4. అహమును వదిలించుటకు గురుసేవే పరమావధి
దేహ శాస్త్ర లోక వాసనాధులను వదలినచో
హృదయగ్రంధి తెగిపడును అదే జన్మరాహిత్యము
నిత్యజీవమదియేరా నిత్యానందమదేరా ॥వెంక॥

*గమనిక:* పై కీర్తనలకు రాగములు వ్రాయలేదు కారణం ఎవరి యిష్టప్రకారము వారు రాగములను నిర్ణయించుకొనవచ్చును.

# కృతజ్ఞతలు

ఇంతవరకు ఇందు ఉధాహరణములుగా వ్రాయబడిన శ్లోకముల గ్రంథములు గురుగీత యోగవాసిష్టము (వసిష్టగీత) , అష్టావక్ర గీత, భగవద్గీతలను తెలుగులోనికి అనువదించిన తాత్పర్యములు, వ్యాఖానములు వ్రాసి ప్రపంచానికి అందించిన మహానుభావులు

1. **శ్రీ శ్రీ శ్రీ విద్యా ప్రకాశనందగిరి స్వాములవారు.**
(యోగవాసిష్టము, గురుగీత , గీతామకరందం)

2. **శ్రీ చుక్కా అప్పలస్వామిగారు** (అష్టావక్రగీత)

3. **పండిత శ్రీ శివచరణముగారు**
(శ్రీ నిర్విశేషానందగిరి స్వాములవారికి )

**ప్రకాశకులు**

శ్రీ శుకబ్రహ్మాశ్రమము కాళహస్తి వారికి,
శ్రీ వ్యాసాశ్రమమువారికి, హృదయ పూర్వకాభినందనములతో
కృతజ్ఞాతాభివందనములు చేసుకుంటున్నాను.

ఇట్లు

విధేయుడు

గ్రంధకర్త.

# మహానంద

**ప్రతి ఇంట్లోనూ ఉండవలసిన ఘూటు, మంటలేని మందు.**

దీర్ఘకాల తలనొప్పులు, సైయాటికా, పక్షవాతనొప్పులు, కీళ్ళ కండరముల నొప్పులు, వాపులు, చనుకుదురు, చప్పి, సెగ్గడ్డలు, కురుపులు, దురదలు తగ్గించును 5సంవత్సరములలోపు పిల్లలు, కాళ్ళుచేతులు సన్నగిల్లి నడవలేని పిల్లలకు ముందుగా 9రోజులు 'సుఖజీవన్'ను వాడించి దీనిని 2నెలలు శరీరము అంతట మర్థన జేసిన యెడల నడిచే శక్తిని కలిగించును. ముఖముపై మొటిమలను తగ్గించి నునుపుగా ఉంచి ముఖసౌందర్యమును పెంచును. కదలలేని అవయవములను కదిలించును. గాయము నుండి వచ్చే రక్తమును ఆపుచేయును. తేలు, జెర్రి, మొదలైన కీటకములు కుట్టిన బాధను తగ్గించును. గాయము నుండి వచ్చే రక్తమును ఆపుచేయును. చెవిపోటు, చెవిలో కురుపులు, పంటి కురుపు, గవదబిళ్ళలు తగ్గును. గోరుచుట్లు తగ్గును. పశువుల కీళ్ళనొప్పులు, చనుకుదురు గడ్డలు,మెడ మీద వ్రణములను తగ్గించును.

10గ్రాములు రూ. 12-00 40గ్రాములు రూ.42-00

## మా ఇతర మందులు

**సోబె** : *శోభి వంచ్చులు, నోటిపూత, నోటిలోని పుండ్లు తగ్గించును. కడుపులోను, గుండెలోను మంట తగ్గించును. పదిరోజుల మందు రూ.8-00*

**శిలాదంతి** : *కదలిన పల్లను గట్టిపరచును. గట్టి పదార్థములను నమలెడి శక్తినిచ్చి పళ్లను ఊడి పోకుండా కాపాడును. పళ్ళసలుపు 3రోజులలో తగ్గించును. పళ్ళ నుండి రక్తము, చీము కారుట ఆపుచేయును.*

*15గ్రాములు రూ॥ 8-00, 50గ్రాములు రూ॥ 21-00*

**మందారచూర్** : తలవెంట్రుకలు ఊడిపోకుండా చేసి, తలపై చుండ్రును తగ్గించును. జుట్టును నలుపుగాను వృధువుగాను

ఉంచును (4 పేకెట్లుమందు) గల బాక్సు రూ॥12-00.

**బర్న్ క్యూర్** : కాల్పులకు వ్రాసిన వెంటనే చల్లబలచి బొబ్బలెక్క నీయకుండా. చర్మము ఊడి పోకుండా మచ్చుపడకుండాచేయును. 40గ్రా॥ రూ॥20-00

**సుఖజీవన్** : సయాటిక, అజీర్ణము, అజీర్ణవిరోచనములు, శుక్లనష్టము, స్త్రీల తెలుపు తగ్గించును, నరముల బలహీనతను తగ్గించును. 9 రోజుల కోర్సు సంవత్సరమునకు ఒకసారి అక్టోబరు నుండి డిసెంబరు లోపు వాడిన యడల జ్వరము రాకుండా చేయును. సుఖవంతమైన జీవితమునిచ్చి ఆయువును పెంచును.

9రోజుల కోర్సు 18 గొట్టములు, రూ॥ 100-00



